ముప్పదిమూడవ పూజాపుష్పము

# శ్రీ మురళి

(లలిత గీతాలు)





రచన

పి. దుర్గారావు, యం.ఓ.యల్

ప్రథమ ముద్రణము :
500 ప్రతులు



శ్రీభావ నామ సంవత్సరము
వసంతము - వైశాఖము
1994-మే

వెల : రు. 10-00

ముఖ చిత్రం :
చలం



ముద్రణము :
దుర్గాభవాని ప్రింటర్సు, విజయవాడ-3.

---

ప్రతులకు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్,
చెరుకుపల్లి పోస్టు (వయా), నక్రేకల్,
నల్గొండజిల్లా.

# వి న య వా క్య ము

'శ్రీ మురళి' అను ఈ లలిత గీతాల పుస్తకమును ముప్పది మూడవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ శ్రీ చరణారవిందములకు భక్తిపూర్వకముగా సమర్పించుకొనుచున్నాను.

ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించుకొనుచు నప్పుడప్పుడు వ్రాసికొనినవి యీ గీతములు. మధురభక్తిని మనోహరముగా వ్రాసికొనిన మహాభక్తురాలు మీరాబాయి, కీ. శే. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి మధుర గీతములే నా యీ లలిత గీతములకు ప్రేరణ యని చెప్పవచ్చును.

శ్రీ కృష్ణుని నాయకునిగా జేసికొని మధుర భక్తితో రచించిన ఈ పుస్తకమును శ్రీ కృష్ణుని చరణారవిందములకే సమర్పణము గావించుకొనుచున్నాను.

ఇందు నా య కు ని గా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు (మురళీ లోలుడేగాక) పరబ్రహ్మ స్వరూపముగాను; ఇంతటి

గోపికా విరహము పరమేశ్వరుని యందు లీనమగుటకు వేదనాపూర్వకమైన జీవి ప్రార్థనగా భావింపవలెను.

ఇదివఱలో ప్రచురించిన లలిత గీతములను ప్రశంసించుచూ పత్రికలు, ప్రముఖులు వ్రాసియున్నారు. వారికి నా నమస్సుమాంజలులు! ఇదే విధముగా మఱికొన్ని పుస్తకములు ప్రచురింపవలెనని నా ఆకాంక్ష.

ఈ పుస్తకమునందుగల 88 గీతములు సాధ్యమైనంతవఱకు పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గుదిగ్రుచ్చబడినవి. రస హృదయుల నే మాత్రము స్పందింపచేసినను ధన్యునిగా భావించుకొందును.

—రచయిత







## సమర్పణ

ఎన్ని మారులు పాడినా
వన్నె దరుగదు నీ పాటకు!
ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమీ తరుగవు గదా!
మఱచి పోవాలన్నా మాధవా!
మఱవురాదు నీ పేరు!

విడిచి పోవాలన్న వీడిపోదు
విడివడని బంధ మిది యేనాటిదో!

తీయని నీ మురళి పాట
తీపిదనం కురిపిస్తుం దెప్పుడూ!
నర్తన జేస్తుం దెప్పుడూ నా యెదలో
నవ్య సుందరములను వెలువరిస్తూ!
అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!
ఆవేదనతో నా మధుర గీతాలను!

యుగయుగాల నాటి వీ మధుర పదాలు!
తరతరాల నాటి దీ హృదయా వేదన!

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సమాజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నతహిమ గిరి శిఖరము లొప్పెడు శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్య గేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో! నా మాతృభూమి!

## దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వరూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధసేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

లలితకళా నందమూర్తి విలసితచైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధాకలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

శ్రీ మురళి

# కల్యాణి శ్రీదుర్గ !

కల్యాణి శ్రీదుర్గ ! కరము వేడుచునుంటి
కనులార! నను జూచి కాచి రక్షింపు!

ఆర్ద్ర భావముతోని యరసి కాపాడుమా!
తీయనీ పలుకిచ్చి తీరుగా దయతోని!

కల్యాణి శ్రీదుర్గ ! కరము వేడుచునుంటి!
కనులార నను జూచి కాచి రక్షింపు!

అడుగడుగు నందునను నమృత వాక్కుల నిచ్చి
మధురాతి మధురమా మధుర భావములిచ్చి!
సంగీత సాహిత్య సరసమా గీతికల
నా నోట బలికింపు నవ్యసుందరములను!

కొండ కోనలయందు కోకిలలు బాడినటు!
సెలయేటి జాలులటు! జిరుగాలి తరగలటు!
ఉదయ సంధ్యలలోని కదిలేటి కాంతులటు!
నా గొంతు రాగాల నవ్యతల దొలికించు!

లలిత కళలను నిచ్చి లాలిత్యమును గూర్చి
విభుని వశబఱచుకొను విమలతను దయచేయి!
శ్రీమురళి జేరుకొను శ్రీని దయజేయుమా!
పాటలో పాటనయి పల్లవినియగునటుల!

కల్యాణిశ్రీదుర్గ ! గరము వేడుచునుంటి!
కనులార! జూచి నను కాచి రక్షింపు!

# శ్రీ మురళి

## ( లలిత గీతాలు )

కొండకోనల్లోన కోకిలా కూయంటు
పాడేటి పాటలో ప్రణయగీతమునా!
నీ మధురగానమే నే విందు గోపాల!
పిల్లనా గ్రోవి యీ పిలుపులే నే విందు!
కొండకోనల్లోన కోకిలా కూయంటు
పాడేటి పాటలో ప్రణయ గీతమునా!

వనవీధి తుమ్మెదలు వయ్యార మొలికించి
పూవుపూవున ప్రాలి పులకరింపులతోని!
పాడేటి పాట నీ పాటగా యనిపించు!
మనసు హరివిల్లుగా మారిపోవును స్వామి!

నీ మురళి ధ్వనులతో నిఖిలమంతా నిండి
ఆకాశమంతయును నావరించిన యటుల!
బండరాళ్ళన్నియును బలుకుచును నీ పాట!
మధుర భావలయందు మాటాడి నటులుండు!

అలలలో పెన్నిధిని యేటుపోటుల యందు
సెలయేటి సవ్వడుల చెట్టుపుట్టలయందు!
నీ మధురగానమే నిలిచినటు లనిపించు!
సిగ్గుతో నాపాట చిన్నబోవును కృష్ణ!
కొండ కోనల్లోన కోకిలా కూయంటు!
పాడేటి పాటలో ప్రణయ గీతమునా!

# కన్నీటి భాష్పమా !

కన్నీటి భాష్పమా! కదలకను నిలువుమా!
పొరలి బయటకు రాకు! పొంగారబోకుమా!

ముత్యాలు దొరలినటు ముడిదెగిన దండలా
వర్ష ధారగ ధరణి వడి వడిగ బడబోకు!

కన్నీటి భాష్పమా! కదలకను నిలువుమా!
పొరలి బయటకు రాకు! పొంగారబోకుమా!

అచ్యుతుని విరహమున యవతరించీ యెదను
గుండెలోతులలోన కుమిలి కుమిలీ పైకి!
పాడేటి పాటలో బడిలేచి వేదనను
కనులయందున నిండి కదలకను నిలిచితివి!

మఱచి పోవగలేను మాధవుని యొక క్షణము
మధురగీతము నాపి మఱియుండ లేనుగద!
గుండెలో వేదనను మండేటి జ్వాలలను
కంటిలో నిను గూడ కసిరి యాపగ లేను!

కిన్నెరను జేపట్టి కీర్తనను బాడినటు
గుండెలోని పాట గొంతులో విరిసినటు!
కన్నీటి భాష్పమా! కలకాల మిటులనే!
నా తోని జతగూడి నటియించు మెప్పుడును!

కన్నీటి భాష్పమా! కదలకను నిలువుమా!
పొరలి బయటకు రాకు! పొంగార బోకుమా!



శ్రీ ము ర ళి

## కఱిగిపోనీ స్వామి!

కఱిగిపోనీ స్వామి! మఱిగిపోనీ! నీలో!
మధురమగు మురళిలో మాయమైపోనీ!
సురుచిరంబయిన నీ సుందరంబులయందు
కలిసిపోనీ! నన్ను గానరాకుండగా!
కఱిగిపోనీ స్వామి! మఱిగిపోనీ! నీలో!
మధురమగు మురళిలో మాయమైపోనీ!

గొంతెత్తి పాడేటి కోమలం బగుగీతి
మనసులోనే మణిగి మఱి సుడులు దిరగనీ!
శ్రుతిలయల సొగసులను సోలుచును మదియందు
మౌనగీతముతోని మాధుర్య మొలుకనీ!

రెక్కలల్లార్చుచును పక్షిలా నెమ్మదిగ
నింగినీలమునందు నిలిచిపయనింపనీ!
తళుకు తారలు దాటి బెళుకు వెన్నెల గడచి
కాంతి పుంజమునందు కలియనీ నిత్యముగ!

అణువణువునందునా యలరి నేనుండాలి!
విశ్వగానమునందు విరియాలి నాదముగ!
నాదంటు, నేనంటు! నాథ! లేకుండనీ!
కన్నీటి భాష్పాల కథలలో మిగులనీ!
కఱిగిపోనీ స్వామి! మఱిగిపోనీ! నీలో
మధురమగు మురళిలో మాయమైపోనీ!

# మధువసంతము నందు !

మధువసంతమునందు మధురమగు గీతినై!
పూవుపూవునజేరి పుప్పొడుల నాలికించి!
వనమంత నాట్యాలు జేస్తాను!
వలపులను గుప్పులుగ పోస్తాను! నే
వలపులను గుప్పులుగ పోస్తాను!

తీయనీ కోకిలా తీరులను నేర్చాను
పాటతో ప్రకృతిని పరవశము జేస్తాను!
అందాల రాగాలు డీస్తాను!
అలరి తీవులను గురిపిస్తాను! నే
నలరి తీవులను గురిపిస్తాను!

వనమయూరములోని వయ్యార మొలకించు
నయగార మొప్పగా నాట్యాలు నేర్చాను!
భువియంత రవలు మ్రోగిస్తాను!
పున్నమీా వెన్నెలలు జేస్తాను! నే
పున్నమీా వెన్నెలలు జేస్తాను!

అందుకే పిలిచితిని 'యందాల కృష్ణ' యని
ఇందుకే నే నయితి నింపొందు గోపికగ!
తలుపు దెఱచితిరమ్మా! గోపాలా!
తగ నీకు స్వాగతము గోపాలా! ఇదే!
తగ నీకు స్వాగతము గోపాలా!

## తెల్లమబ్బుకు వోలె!

తెల్ల మబ్బుకు వోలె నా మది
ఉల్లమంతా తెల్లనాయెను!
పాటరాదూ! మాటరాదూ!
శిలగ మారితి! శిల్పమైతిని!
తెల్ల మబ్బుకు వోలె నామది
ఉల్లమంతా తెల్లనాయెను!

విభుని కొఱకయి వేయికన్నుల
నెదురు చూచీ, యెదురుచూచీ!
రాత్రులే మఱి పవళులాయెను!
రాత్రులాయెను బవళు లన్నీ!

పిలిచి పిలిచీ మాధవుని నా
ప్రేమగీతిక యాగిపోయెను!
మనసుకొలనే యెండిపోయెను
మధురపుష్పము నెటుల దెత్తును?
ఉలిని జెక్కిన శిల్పమైతిని!
కవులు వ్రాసిన కావ్యమైతిని!
విరహమన్నది యిటుల జేసెను
వేడుకన్నది దూరమాయెను!

మాధవా! యిక నిలుపుకో! నీ
మనసుదీరగ కనుల యెదుటను.
ఆలయంబున గోడలందున
అందమగు నొక చిత్రప్రతిమగ!

## ఏనాటి మాట యిది !

ఏనాటి మాటయిది? ఏనాటి పాటయో?
వివరింపలేనుగా విశదముగ కృష్ణా!

అలనాటి బంధువులు నాత్మీయులందరును
మఱుమాయమైరిగద! మాధవా! యిపుడూ!

ఏనాటి మాటయిది? ఏనాటి పాటయో!
వివరింపలేనుగా విశదముగ కృష్ణా!

మధుర గోపికను [నే మాటయిది సత్యమిది!
రాసక్రీడను నాడు రమణీయ నర్తకిని!
వలచి వలిపించితిని వన్నెలాడా నిన్ను
బృందావనమునందు అందముల గుఱిపించి!

బంగారు కిన్నెరను బలికించి మధురముగ
పాటబాడితిగదా! భావబంధురముగా!
కాలియందెలు గదిలి ఘల్లు ఘల్లున మ్రోవ
నాట్యమాడితిగదా నాథ! నీ వెనువెంట!

సాక్ష్యమెటు దెత్తు నా సఖియలను నెటు దెత్తు?
బృందావనములోని శృంగారమంతయును!
వ్రతమాచరించినా వ్రజ సుందరిని నేను
మార్గశీ మాసమే మఱిసాక్షి శ్రీకృష్ణ!

# రగిలి నాలోనేను !

రగిలి నాలో నేను రవ్వలయి పోయెదను!
జిటిలి పోయెదను! నే శీర్ణమై పోయెదను!

నా హృదయ వేదనను నలువురికి వినిపించి
కరుణ యాచింపనూ! కన్నీటిభాష్పమును!

రగిలి నాలో నేను రవ్వలయి పోయెదను!
జిటిలిపోయెదను! నే శీర్ణమై పోయెదను!

నా కలత నలతలను నాలోనె కుములుదును!
వినిపింప నెవరికిని వేదనల ధ్వనియించి!
నాలోనె సుడిదిరిగి నాలోనె యణిగిపో!
కసిదీర యణచెదను! నిసుమంత గవరాక!

కాలరాత్రులలోని కటిక చీకటినంత
నా గుండెలో దాచి నాట్యాలు జేయింతు!
దుఃఖాగ్ని జ్వాలలను దురపిల్లు నామదిని
బయలుగ్రక్కక లోన భద్రబఱతును శాంతి!

మాథవుకు మనసిచ్చి మధురగోపిక నయితి
స్వీకరించినగాని చిన్నబుచ్చినగాని!
నలుగురుకి దెలిపి నే నగుబాటు బాలవను!
మదిలోనె రోదింతు! మానముగ! శాంతముగ!

రగిలి నాలో నేను రవ్వలయి పోయెదను!
జిటిలిపోయెదను! నే శీర్ణమై పోయెదను!

## అరవిరిసినా కలువ !

అరవిరిసినా కలువ! అటులె నిలువకు చెలీ!
కన్నీరు నింపుచును గలత బడబోకూ।

జాబిల్లి వచ్చినను సరసతను బోనాడి
తలవాల్చుకోనెదేల? తన్వి! తల యెత్తవే!
అరవిరిసినా కలువ! అటులె నిలువకుచెలీ!
కన్నీరు నింపుచుసు గలత బడబోకూ!

చిరు చేపలన్నియును జేరి రోదనమునను
దాకుచున్నవి జూడు! దగ మీదికెగయుచును!
ఓదార్పు మో చెలీ! యోరకంటను జూచి
వికసించి పరిమళము వినువీధి కెగయగా!

సన్నగాలులుగూడ సఖియ! నిను దాకుచును
వీచుచున్నవి చూడు! వింజామరలవోలె!
చిరునవ్వుమోని యిటు జింతవంతలతోని
నా విరహామును జూచి నలిగిబోవకు మన్మ!

పాలవెన్నెలతోని పతిదాపు వచ్చినను
మానమూనుట దగున? మాటాడకుండగను!
కలకలా హసియించు కాంతిరేకలు దోలుక!
తుమ్మెదలు జుమ్మనుచు దోలుకాడ నిను జూచి!
మాధవుని గూర్చి నే మదియందు జింతిలగ
నీకేల కన్నీరు నివ్వటిల్లగ జింత?
రేరాజు హసియింప విరియుమా అందాలు!
నాకొఱకు గన్నీరు నలిగి ప్రవహింపకుము!

# ఉవ్వెత్తుటలలతో !

ఉవ్వెత్తుటలలతో నూగేటి జలధిలా!
మార్మ్రోవను సఖి! మధుర వేదననూ!
మధురభావను బలికి మాధవుని వినుతింతు!
ఉదయ సంధ్యను దోలికి కదలు జిరుగాలిలా!
ఉవ్వెత్తుటలలతో నూగేటి జలధిలా!
మార్మ్రోవను సఖి! మధుర వేదననూ!

గొంతెత్తి బిలిచితిని కోమలాంగుని జేర
క్రొంగ్రొత్త పాటలను గొసరి బాడితిగదా!
అలలవలె జెలరేగి నురుగులయి పోయితిని!
సుడులలో దిరుగుచును స్రుక్కిపోయితిసఖి!

కొండకోనలలోని కోకిలకు వలె బాడి
పిలిచినా పిలుపులకు బ్రియబాంధవుడు రాడు!
చిలుక పలుకులవోలె జిత్రముగ బలికితిని
మాధవుడు మఱిరాడు! మఱియేమి చిత్రమో!

మానమును బాటింతు మాటాడకుండగను
యోగిధ్యానము వోలె రాగమును విడనాడి!
పూమొగ్గ విప్పారి పులకరించిన యటుల
చల్లగాలికి గలున పల్లవించిన యటుల!

ఆకాశమున తార యలరి నిలిచిన యటుల
చంద్రకాంతులు కొలను జారి మునిగిన యటుల!
తనరూపు కొలనులో దగజూచి కలహంస
తన్మయము నొందినటు దగు మాన మూనుదును!

# వాసంత మొచ్చింది !

వాసంత మొచ్చింది వన్నెలను జిందుచూ!
నా విభుడు రాడాయె నా రామచిలుకా!

పంజరములో నుండి పలుకులే పలికేవు!
విభుడెప్పు డొచ్చునో వేడుకను దెలుపవూ!

వాసంత మొచ్చింది వన్నెలను జిందుచూ!
నా విభుడు రాడాయె నా రామచిలుకా!

చిగురాకు బూవులను జిత్రముగ వనవీధి
తీపితావులు జింది తేనెలను గురిసింది!
వాసంత ఋతువులో వత్తునని కబురంపె
ఏడి? రాడే! వాని మదిలోతు దెలియదూ!

ఒకటి రెండూ నాళ్ళ? వారాలు గడిచినవి!
తాను గీచిన గీత తానె జవదాటెనూ!
విరహాన తపియించి విలపించు నావలపు
ఆడవిగాచిన వెన్నెలాయెనే రా చిలుక!

పంజరములో నుండి పయనించి వినువీధి
ఎచటనున్నా విభుని వేగిరము గొనిదెమ్మా!
మధుర ప్రియ వచనముల మాధవుని బ్రతిమాలు!
నిను విడిచి నీ దాసి నిలువదని దెలుపుమా!

వాసంత మొచ్చింది వన్నెలను జిందుచూ!
నా విభుడు రాడాయె నా రామచిలుకా!

## పంతమిటు లేలనో !

పంతమిటు లేలనో! పరికింప నా వలపు!
నా ప్రేమ తెలియదా? నాథ! గోపాలా!

నా మధుర గీతికలు నా భక్తి వచనములు
మఱల విను మొకసారి మానసము పులకింప!

పంత మిటు లేలనో! పరికింప నావలపు!
నా ప్రేమ తెలియదా? నాథ! గోపాలా!

వెన్నెలంతా త్రాగు యేటివలె ఆశతో
నిన్ను గోరగ లేదు! నిండారు గాగిలిని!
నీ పదములంటగా నిఖిలేశ! గోరితిని!
దాసివలె నుండగా దయను దయజేయమని!

బంగారు బల్లకిని బంపుమని నే గోరి
దాసదాసీజనుల దరి జేర్ప మనలేదు!
కాలినడకను నిన్ను గలియగోరుచు నుంటి
దూరముగ నిను జూడ దోరంపు గోరికయొ!

చిన్ని కోరిక దీర్ప! వన్నెలిటు జేసేవు
కన్నె మనసిటులేల గలత బఱచెదు స్వామి!
అన్నిటికి నీ వనుచు నల కరీంద్రుని వోలె
కరములెత్తి కృష్ణ! కావు మనుచుంటినీ!

పంత మిటులేలనో! పలికింప నా వలపు!
నా ప్రేమ తెలియదా? నాథ! గోపాలా!

## నింగి నీలమునందు !

నింగినీలమునందు నిలిచినా ఓ తార!
ఒకమాట దెలుపుమా! ఒయ్యార మొలుకా!

నా కృష్ణు డొచ్చునా? నను హృదిని జేర్చునా
చిరకాల కోరికను దీర్చునా! యికనయిన!

నింగినీలమునందు నిలిచినా ఓ తార!
ఒకమాట దెలుపుమా! ఒయ్యార మొలుకా!

ఎన్నెన్నొ యాశలను ఎదురు తెన్నులు జూచి
అతని రాకను గోరి యలరితిని యిన్నాళ్ళు!
కన్నె తన మంతయును గఱిగిపోయెను గదా!
తోడిమ రాలేపూవు జడిమ నా బ్రతుకాయె!

ఇంపయిన వెన్నెలను నిసుక తిన్నెలపైని
పాడినాపాటలును బ్రతిన లన్నియుగూడ!
మఱచినా మాధవుడు మఱల వచ్చి నాదు
ఘూహామును దీర్చి తన మురళిలో జేర్చునా?!

ఆకాశవీధిలో నలరేటి ఓ తార!
దూరదర్శిని వీవు! దురపిల్లు నా బ్రతుకు!
మురళిలో స్వనముగా మోదమును బొందునా?
వానచినుకుగ నేల వడి రాలిపోవునా?

నింగి నీలమునందు నిలిచినా ఓ తార!
ఒకమాట దెలుపుమా! ఒయ్యార మొలుకా!

## మనసిచ్చి మాధవుడు !

మనసిచ్చి మాధవుడు మాటాడి నటులుండు!
మురళి నూదిన యటుల మోహమున ముంచీ!

పదములంటే నేను పాటపాడిన యటుల
జ్యోతిలో జ్యోతిగా ప్రీతి జెందిన యటుల

మనసిచ్చి మాధవుడు మాటాడినటులుండు!
మురళి నూదినటుల మోహమున ముంచీ!

వన వీధిలో నుండి సనసన్న రవళినీ
మధురగీతము వినుచు మైమఱచి నటులుండు!
చిన్ని గోపాలుడట చిత్రముగ పరుదెంచి
సేదదీర్చిన యటుల సింగార మొప్పనే!

చందమామను నింగి జాలిగా నే జూచి
మాధవుం డెచట యని మమతతో నడిగినటు!
వెనుక నున్నా డదిగో! వేణుగోపాలుడని
జాబిల్లి పలికెనటు సఖియ! మది దోచునే!

కనులు మూసిన యటుల గారవించిన యటుల
నయమార నాతోని నాట్యమాడిన యటుల!
కలయందునా? యంత నిజమందునా చెలీ!
మాధవుని లీలలను మఱచిపో లేనమ్మ!

మనసిచ్చి మాధవుడు మాటాడినటులుండు!
మురళి నూదిన యటుల మోహమున ముంచీ!

## ఆకురాలిన యటుల!

ఆకు రాలిన యటుల అందాల రాగాలు
చిదపలయి నేలపయి చింది రాలుచునూ!

సుడిగాలిలో ధూళి సుడులు దిగిరిన యటుల
నాగీతి భావాలు సడయాడు చుండె చెలి!

ఆకు రాలినయటుల అందాల రాగాలు
చిదపలయి నేలపయి చింది రాలుచునూ!

కాంతి కిరణము పోలె గలసిపోదునటంచు
కలలెన్నొ కంటినీ గంధర్వకన్నెలా!
ఆటలాడుచు మురళి పాటలో లీనమయి
తేలిపోదు నటంచు దీరుగా దలచితిని!

బంగారు మెట్లపై పయనించి నింగినీ
అందాల తారలను నల సూర్య చంద్రులను!
ఆవలను నున్న యా యతిలోక సుందరుని
ఎదలోన దీపమై మెదులుదును ననుకొంటి!

నల్లనీ ముసుగేదొ నా మేను గప్పినది
కంటిలో జీకటులు గలవరము జేసినవి!
తెలవారునా? లేక కలకాల మింతేన?
వాసంత మొచ్చున? వన్నెలలి జిందునా?

ఆకు రాలినయటుల అందాల రాగాలు
చిదపలయి నేలపయి చింది రాలుచునూ!

## జంట విడువకుము !

నా జంట విడువకుము! నీ జంట విడిపోను!
జన్మ జన్మల నిటుల జారనీ కృష్ణా!
నా పాటలో నీవు నాట్యామాడా లెపుడు!
నీ మురళి స్వనములను నే వినగ నెల్లపుడు!
నా జంట విడువకుము! నీ జంట విడిపోను!
జన్మ జన్మల నిటుల జారనీ! కృష్ణా!

నీ నీడలో నేను నిఖిలమంతా దిరుగ
పూవులో తావిగా బులకరింపగ జగతి!
ముత్యాలదండలో మురిపెముగ నే నొక్క
ఆణిముత్తెము లాగు నలరగా జేయుమా!

కోటికాంతులు జిందు కొలనులో దామరకు
నే నొక్క రేకగా నిలిచి యుండగ కోర్కె!
సంధ్య వెలుగుల యందు సరసముగ నే నొక్క
కాంతి కిరణము లాగు గరుణింపు పరమాత్మ!

నిన్ను వరియించితిని! నీతోని నా బ్రదుకు!
చిరకాల బంధమును జెరుపకుము గోపాల!
కలకాలమిటులనే కలిసియుండుము స్వామి!
వెంట నిడుకొని పొమ్ము! విడివడకు నెపుడయిన!
నా జంట విడువకుము! నీ జంట విడిపోను!
జన్మజన్మల నిటుల జారనీ కృష్ణా!

# నింగిలోపల నీవు !

నింగిలోపల నీవు! నేలపై నే నుంటి!
కలియు టెటులో మనము గలిసి పయనింపా?

ఈదరిని నే నుంటి! యా దరిని గల వీవు
ఎటుల సమకూడు జత ఏకాంత మెటుబాయు?

నింగిలోపల నీవు! నేలపై నే నుంటి
కలియు టెటులో మనము గలసి పయనింపా!

మనసులో నినుగూర్చి మధుర భావాలతో
విలపించు చుంటినే వేయిగీతాలతో!
వినిపించుకోవుగద! కనికరించీ నన్ను!
ఎదజేర్చుకొని నన్ను సదయ! మన్నింపవూ!

తారలా తళుకులా తగచందమామలా
మబ్బులో మసకలో మసులుచుంటివి స్వామి!
నే నెటుల నిను జేరి నిండుపున్నమి నగుదు?
మట్టిలో నున్నట్టి మల్లె తీవెను నేను!

నీవె రావలె కృష్ణ! నిండారు కరుణతో
ఆశదీర్చి దాసి నాదుకోవలె స్వామి!
జన్మజన్మల భక్తి చైతన్య దీపికను!
కాంతికిరణము లాగు గనికరింప గదోయి!

నింగిలోపల నీవు! నేలపై నే నుంటి!
కలియు టెటులో మనము గలిసి పయనింపా!

# పలుకకే కిన్నెరా !

పలుకకే కిన్నెరా! బంగారు స్వప్నములను
పాటపాడగలేను! బడలిపోతినిగా!

హృదయాన నున్న నా మధురభావనలన్ని
చెదిరిపోవుచునుండె చిరకాల నేస్తమా!

పలుకకే కిన్నెరా! బంగారు స్వప్నములను
పాటపాడగలేను! బడలిపోతినిగా!



నీతోని జతగూడి నిత్యమును నిన్నాళ్ళు
కలిసి పాడితి గదా! కమ్మనీ రాగాలు!
పాడినా పాటలకు పల్లవిని కలుపదమా!
కనికరించి నన్ను గారవింపదు స్వామి!



గుండెలో భావాల కువకువలు లేవాయె
మనసులో నచ్యుతుని మధుర చిత్రము మాసె!
పదములన్నీ కలిసి పాటగా రాదాయె!
గొంతులో రాగాల కోమలత్వము మాసె!

ఇన్నాళ్ళవలె నేను యింపుగులుకగలేను
కన్నీళ్ళు మిగిలినవి కలలాయె కోరికలు!
శిశిరమది యే తెంచి సింగారములు మాపె
మరుజన్మకయిచెలీ! మసిలిపోవుచు నుంటి!

పలుకకే కిన్నెరా! బంగారు స్వప్నములను
పాట పాడగలేను! బడలిపోతినిగా!

# వినిపించుకోవేమి !

వినిపించుకోవేమి వేదనల నిసుమంత!
కనిపించి కరుణతో గారవింపవుగా!

ఆటుపోటుల బ్రతుకు నలజడిని మాపి నను
చిరశాంతి పర్ణకుటి జేరనీయుము స్వామి!

వినిపించుకోవేమి వేదనల నిసుమంత!
కనిపించి కరుణతో గారవింపవుగా!

మనసునిచ్చి నన్ను మనిషిగా జేసితివి!
మధురమగు నీప్రేమ మాధుర్య మిచ్చితివి!
తీయగా నిను బిలువ తేనెలూరే కవిత
మదియందు నిలిపితివి మఱచిపోకుండునటు!

మురళి నిస్వనములను ముద్దుగా వినిపించి
కమ్మనీ రాగాలు కరుణతో దయచేసి!
మదిపులకలను ముంచి మధ్యలో తెరవేసి
ఆడలాడుట తగునె? అది నీకు న్యాయమా?

చిత్రమైనా బ్రతుకు చిరకాల మిటులనే
గడుపవలెనో యేమొ! కంటినీ రాలుకుచును!
గమ్యమది యెచటికో! కథయెటుల ముగియునో!
సూత్రధారివి కృష్ణ! సురుచిరంబగు కథకు!

వినిపించుకోవేమి? వేదనల నిసుమంత?
కనిపించి కరుణతో గారవింపవుగా!



శ్రీ ము ర ళి

## మచ్చికను నా మనవి !

మచ్చికను నా మనవి మన్నింపవడే చెలీ!
ముచ్చటగ నాగీతి మోదమున వినవడే!

మనసు విడిచీ పోడు మాధవుడు క్షణమైన
కనుమూసినాగాని కదలాడు కనులలో!

మచ్చికను నామనవి మన్నింపవడే చెలీ!
ముచ్చటగ నాగీతి మోదమున వినవడే!

యేనాటిదోగాని యేచిత్రబంధమో!
విడివడని ముడులతో విరచింపబడినదీ!
కరుణింపకున్ననూ కలత జేకూర్చినను
ఆర్ద్రిభావముతోని యతనికై పలవింతు!

తీయనీ పాటలను దేవ లాలికించితిని!
అందాల గోపికగ యాటలాడితి సఖి!
రాసక్రీడలనాటి రమణినని దెలిపితిని!
మాట మాత్రము బలికి మనవి వినగూడదా?

నావెనుక నీడగా నడయాడు చుండునే
మురళి బాడుచునుండు మోదమును జిందుచూ!
మన్నింపగూడదా మాధవుడు నా వలపు
చెల్లింపగూడదా! చెలి ననుచు మది గోర్కె!

మచ్చికను నా మనవి మన్నింపవడే చెలీ!
ముచ్చటగ నా గీతి మోదమున వినవడే!

# కలిసి పాడుము !

కలిసిపాడుము పాట! కమనీయ రాగాన!
తేనెలొలికే తీరు తీయగా కృష్ణా!

వనవీధి యంతయును వన్నె లొలికేటట్లు
అణువణువు ప్రకృతిని యందాలు జిందునటు!

కలసిపాడుము పాట! కమనీయరాగాన
తేనెలొలికే తీరు తీయగా కృష్ణా!

మధుర పదములతోని మాధుర్యములు జిలుక
యెదలోని వలపంత యేర్చి కూర్చితినోయి!
దూరాన కోకిలలు రాగాలు దీసినటు
కోనలో సెలయేఋ వీణమీటిన యటుల!

కవి హృదయమున క్రొత్త కవిత విరిసినయటుల
కవితలో గాంధర్వ కాంత వెలిసినయటుల!
కాంతయెదలో విరియు కమనీయ గీతమే
నా హృదిని వికసించె నవరాగ ధ్వనులలో!

ఆ పాటతో కలిపి యాలపింపుము కృష్ణ!
అందాలమురళిని! యా దివ్యస్వనములను!
నే ధన్యనై పోదు! నింగి నీలమునందు
కాంతిలో లీనమై కలిసిపోదును కృష్ణ!

కలిసిపాడుము నాతో! కమనీయరాగాన!
తేనెలొలికే తీరు తీయగా కృష్ణా!

# నా యెదుట నీ మురళి !

నా యెదుట నీ మురళి నాదాలు ఎన్నాళ్ళు?
నీ యెదుట నే బాడి నిలుచుటెన్నాళ్ళో?

అంతులేని కథకు నంతమే యికలేద?
చివఱిపేజీ లేని చిత్రమగు కథ మనది!

నా యెదుట నీ మురళి నాదాలు ఎన్నాళ్ళు?
నీ యెదుట నే బాడి నిలుచు టెన్నాళ్ళో?

మురళి రవములలోని ముద్దుగా నన్నెన్నొ
రాగాలు వెలయించి రవములను జేసేవు!
మధురాక్షరములతో మధురపదములతోని
ఆడిపాడుచునుంటి! అందాల గోపాల!

నను శిల్పముగ జేసి నాట్యాల ప్రతిమగా
నీ యాలయము నందు నిలిపితివి గదస్వామి!
నినుజూచుచుంటినీ! నిత్యమును బ్రతిక్షణము!
నను జూచుచుంటివీ! నాథ! కనులార్పకను!

తనివిదీరదు మనకు దగజూపులందునను
పాడేటి పాటలను బలుకును నాటలను!
నా గుండెలో నీవు! నీ గుండెలో నేను!
అతికినపుడే గలుగు! అమృతంపు చిరశాంతి

నా యెదుట నీ మురళి నాదాలు ఎన్నాళ్ళు?
నీ యెదుట నే బాడి నిలుచు టెన్నాళ్ళో?

## కొండదాటి, కోనదాటి!

కొండదాటీ కోనదాటీ!
కోంటకులన్నీ దాటుకుంటూం!
కోకిలకువలె 'కూ' యనంటూ
కోరివచ్చానోయ్! కృష్ణా! కోరివచ్చానోయ్!

ఏఱుదాటీ, వాగుదాటీ!
ఎతుపల్లము లన్ని దాటీ!
చెట్టు పుట్టల నన్ని దాటీ!
చేరవచ్చానోయ్! కృష్ణా! చేరవచ్చానోయ్!

కొండ శిఖరము చాటు నిలిచీ!
కొనరి మురళిని బాదుకుంటూ!
మనసుదోచుట, మమతబెంచుట
ఎన్నినాళ్ళోయీ! కృష్ణా! ఎన్నినాళ్ళోయీ!

మనసు మాధుర్యమున నింపీ!
మమత ప్రేమల జతనుగూర్చీ!
వెతలు గూర్చుట ధర్మమా? నీ
కతలు యింతేనా! కృష్ణా! కతలు యింతేనా!

చాటు మాటులు వలదు మనకిక
సరస గోపిక నోయి కృష్ణా!
పతిగ నిను భావించితోయీ!
సతిగ వీక్షింపూ! నన్నూ సతిగ వీక్షింపూ!

# మనసులోని బాధ!

మనసులోని బాధ! మాటు మణగకుమమ్మ!
కలిసి నాతోనుండు! కలకాల మిటులా!
అచ్యుతునిపై నున్న యనురాగ తరగలకు
నీవె సాక్షివి సుమా! నిలిచి యటులే యుండు!
మనసులోని బాధ! మాటుమణగకుమమ్మ
కలిసి నాతోనుండు! కలకాల మిటులా!

కన్నీటి వరద లెటు కాల్వలయి పొంగెనో!
కలువ తామర లెటుల కలిసి ప్రవహించెనో!
వలపు తెర లెటు లెటుల వడి సుడులు దిరిగెనో!
అంత తెలియును నీకు నాటు పోటుల వ్యథలు!

మనసు జ్వాలగమారి మధురమగు గీతాల!
కిన్నెరను జేబుట్టి కీర్తనలు బాడినది!
వెన్నెలకు దూరముగ చిన్ని తారల గనక!
కన్నులర మూసినది కథయంత దెలియునే!

కలువ తామరులతో గథనంత తెలిపినది!
మంచుతుంపురలతో మాటాడినది తెలియు!
చిలుక గోరింకలను బలుకబోకండనుచు
కసిరినది తెలియు! నా కథయంతటికి సాక్షి!

అచ్యుతుడు వచ్చినపు డానవాగ నీవె
కథనంత తెలిపి యా కటిక చీకటి తెరల!
వెలుగు తరగలజేసి విమలకాంతులు నింపి
ఆనంద హర్షముల నపుడు కురిపింప వలె!

# విరహాకుల గోపకాంత !

విరహాకుల గోపకాంత
వేదన వినలేవటోయి!
ఒక్కసారి యెదుట నిలిచి
మక్కువ వేణువు నూదుము!...విరహాకుల॥

అల్లనాటి గోపికనని
యుల్లమునందున దలచుచు
నిన్ను పతిగ నెంచుకొనుచు
ఉన్నదంత యర్పించితి!...విరహాకుల॥

వేణువు నూదుచు నామది
వేదన దొలగింతు వనుచు!
కన్నులన్ని నీ విూదే
చిన్ని కృష్ణ! వత్తువనుచు!...విరహాకుల॥

నదులు గిరులు పర్వతములు
నడుచుచుంటి నిన్ను గలియ!
కంటినీటి పాటలతో
జంట నీవె యనుకొనుచును! ॥విరహాకుల॥

నా వెనుకే వత్తువనుచు
నాథ! తెలియు నాదు మదికి!
నిలిచి యెదుట మురళి నూది
వలపు తీర్పు లందనిమ్ము! ॥విరహాకుల॥

# ఎంత వలపు ! ఎంత ప్రేమ !

ఎంత వలపు! ఎంత ప్రేమ!
అంత తెలియులే స్వామీ!
నన్ను విడిచి యుండలేవు!
నాథ! క్షణము దూరముగా!
ఎంత వలపు! ఎంత ప్రేమ!
అంత తెలియులే స్వామీ!

ఇల్లు కట్టుకొంటివి నా
యుల్లమందు సొగసుదీర!
పిల్లన గ్రోవిని యూదుచు
ప్రేమ మీర నర్తించుచు!

మధురాక్షర నామములను
మనసుకు నర్పించితివి!
మంజుల స్వర నాదములను
మాధుర్యము గూర్చితివి!

నదులతోని గిరులతోని
నవసంజల కుంకుమలను!
చందమామ కాంతుల నే
అందముగను చరియింపగ!

అడుగు మనుచు కోరికలను
యాచన జేయుదు వెందుకు?
కోరునదేమీ లేదిక
గోవిందా! నీవు దప్ప!

## పడవ నడుపుకుంటు నేను!

పడవ నడుపుకుంటు నీదు
పాటపాడుకుంటు నేను!
వెనుక వచ్చుచుంటి ప్రభూ!
వేగ మింత యాపరాద! ॥పడవ॥

అలల తెరల నడుమనుండి
మలుపు లెన్నొ దాటుకుంటు!
గండ శిలలు కొండరాళ్ళ
గడిచి వచ్చుచుంటి స్వామి! ॥పడవ॥

సుడిగుండములందు జిక్కి
సురసుర నే సుడులు దిరిగి
పెనుగాలుల తాకిడికిని
వెనుదీయక దరలుచుంటి! ॥పడవ॥

పడవకు చుక్కాని లేదు!
పయన మెటకో తెలియలేను!
తెరచాపయు లేదు ప్రభూ!
తీర మెటో! గమ్య మెటో! ॥పడవ॥

నీ వెనుకనె నా పయనము!
నీ వెటకో! నే నటకే!
అందులకే యాగుమనుచు
నాలపించుచుంటి స్వామి, ॥పడవ॥

# నా యండ నీ వనుచు !

నా యండ నీ వనుచు నన్నాదు కొమ్మనుచు
నీ వెనుక నడిచితిని నిఖిల లోకేశా!

నాయండ నుంటివీ! నన్నాదుకొంటివీ!
మఱచిపోలేను నీ మాధుర్యమును కృష్ణ!

నాయండ నీవనుచు నన్నాదు కొమ్మనుచు
నీ వెనుక నడిచితిని నిఖిలలోకేశా!

చిమ్మచీకటి నుండి చిరువెలుగు కాంతులకు
నన్ను నడిపించితివి తిన్ననీ దారులను!
చింత వంతల నుండి చిరదాస్య బంధముల
దయను దప్పించితివి దాక్షిణ్య మలరగా!

కోరినా కోరికల కొసలేక మిగులకను!
చేర్చి కూర్చితివి నా చిర వాంఛితములనూ!
అడుగకనె యిచ్చితివి యఖిలేశ్వరా! నీదు
ప్రేమ భాండారమున ప్రీతి కానుకలన్ని!

కానుకలు యిక వలదు! కల్యాణములు వలదు!
కోరికల వలయందు గోరి దూరగలేను!
నీ వెనుక నడిచితిని నీడలో నీడగా!
ఆ నీడలో నన్ను నలరి కలియగ నిమ్ము!

నాయండ నీ వనుచు నన్నాదు కొమ్మనుచు
నీ వెనుక నడిచితిని నిఖిల లోకేశా!

# పాడేటి మురళి !

పాడేటి శ్రీమురళి పాటనాపకు కృష్ణ!
పాటయిన విందు నే బరవశము జెందీ!

ఎంతదూరము నడిచి యెన్ని యాతనలు పడి
యిట జేరితి సఖా! యింతయిన నెరుగవూ

పాడేటి శ్రీమురళి పాటనాపకు కృష్ణ!
పాటయిన విందు నే బరవశము జెందీ!

నీ మురళి నిస్వనము నిసుమంత చెవిబడిన
నే నిలువలేను మది నే నిలుప లేనోయి!
అల దిరుగబడినటుల మదిదిరుగ బడు స్వామి!
మనసులో రాగాలు మఱి నిలుప లేనోయి!

మురళి పాటను విసగ మోహాన నామదిని
మధురాక్షరము లేవా! మాటలయి! పాటలయి!
వెల్లి విరియును కొలని విప్పారు గలువలుగ!
అందాల భావాల యపురూపు గీతికలు!

దయలేకపోయినను దాసిపై కరుణించి
పాట నాపకు కృష్ణ! ఫణివోలె పరువమున!
మోసమును భరియించి మఱియుండిలేనోయి!
కాటువేయుదు నేమొ! కలగి నీ మురళిని!

పాడేటి శ్రీమురళి పాటనాపకు కృష్ణ!
పాటయిన విందు! నే బరవశము జెందీ!

# చింతలవి యేమ్మున్న !

చింతలవి యేమ్మున్న జిరునవ్వు నవ్వేదను!
కలకలా హాసియింతు గంట నీరున్నా'

గుండెలో దుఃఖాగ్ని కుమిలి పోవుచునున్న
తీయగా మాటాడి తేన లొలకించెదను!

చింతలవి యేమ్మున్న జిరునవ్వు నవ్వేదను!
కలకలా హాసియింతు గంటనీరున్నా!

నను విరహమున ముంచి నను దూరముంచినా
నా విభుని నిందించి నలువురికి దెలుపనూ!
కంటి నీరొలుకుచును గరుణవేడను జెలుల
మాటమాత్రమునైన మది బయలు వెట్టనూ!

కోకిలల పాటలకు గుమిలిపోవుచునున్న
చిలుకపలుకులకు నే జింతించుచున్ననూ!
బడబాగ్నిలో నేను బడిలేచుచున్ననూ!
హంసవలె నడయాడి యందాలు జిందెదను!

మనసులో విరహాగ్ని మరిగి పోవుచునున్న
మాధవుడు నను వదిలి మాయమైనా గూడ
పలువురికి నే జెప్పి కలుచబడు టెందులకు?
ఒకనాడు విచ్చేయు వల్లభుడు దయతోని!

చింతలవి యేమ్మున్న జిరునవ్వు నవ్వేదను!
కలకలా హాసియింతు గంటనీరున్నా!

# నీ పాటతో కలిపి !

నీ పాటతో కలిపి నే బాడలేనోయి!
నా పాట నాదోయి! నీ పాట నీదీ!

విశ్వమున యణువణువు వినిపించు నీ ధ్వనులు
నా చిన్ని గొంతులో నాదాలు నావీ!

నీ పాటతో కలిపి నే బాడలేనోయి!
నా పాట నాదోయి! నీ పాట నీది!

కొండలను కోనలను కోకిలా పాడేటి
మధుర నాదాలతో మధురిమలు నీవీ!
పువ్వు పువ్వున వ్రాలి పులకలను గలిగించు
తుమ్మెదా నాదాల తోరణము నాదీ!

గిరి శిలల దాకుచును సిరుల నొలికించేటి
మంజుల ధ్వను లీను మాధుర్యమీవూ!
అలలు తెరలూలేని అందాల కొలనులో
నిలిచినా నీటిలో నిట్టూర్పు నే స్వామి!

జీవకోటికి దివ్య దిశల జూపించేటి
చైత్య గీతిలో శ్రావ్యనాదము నీవు!
మబ్బులో మసకలొ మనిషిలో పలికేటి
విరహగీతము లోని విమలనాదము నాది!

నీ పాటతో కలిపి నే బాడలేనోయి!
నా పాట నాదోయి! నీ పాట నీదీ!

# దాపు కొచ్చితినోయి !

దాపుకొచ్చితినోయి! దరిజేర సిగ్గగును!
మురళిగానము వినగ మోహమున కృష్ణా!

మాలతీలత వెనుక మల్లెపూ పొదయందు
నిలిచియుంటిని స్వామి! నీ గానమును వినుచు!

దాపుకొచ్చితినోయి! దరిజేర సిగ్గగును!
మురళిగానము వినగ మోహమున కృష్ణా!

చిరుచెమట చిలికినది చిత్రముగ నెమ్మోము
మాటరాకున్నదీ! మర్మముగ మనసులో!
అడుగుముందుకు బోదు! అడుగు వెనుకకు రాదు!
అందాల బొమ్మగా నలరియుంటిని స్వామి!

నీతోని జతగలిసి నిండుగా నొకపాట
పాడుతూ యాడుతూ పరవశించాలనీ!
చిరకాల కోర్కెయిది! యర విరియు కలువలా!
తపసు జేయుచునుంటి! తగ నీకు దెలియు నిది!

కడిమి దిగి వచ్చినను గనికరింపుము స్వామి!
సిగ్గుబిడియము మాన్పు! దీనత్వమును బాపు!
గొంతెత్తి పాడుమని కోరికను బూరింపు!
మురళీ నాదీ జతగ మోదమును వర్షింపు!

దాపుకొచ్చితినోయి! దరిజేర సిగ్గగును!
మురళిగానము వినగ మోహమున కృష్ణా!

## అతడే నా పతి !

అతడే నా పతి! యతడే విభుడూ!
అందమైన యా మురళీ లోలుడు!

అణువణువును నఖిలాండమంతయును
నణగి యుందువా డతడే! యతడే!

అతడే నా పతి! యతడే విభుడూ!
అందమైన యా మురళీ లోలుడు!

పిల్లనగ్రోవిని జేతను బూనీ
ఉల్లమలర న ర్తనలను జేయుచు!
ఆలమందతో నల బృందావని
ఆటలాడు గోపాలబాలుడే! ॥అతడే॥

పిలువగానె పిలుపులలో బలుకును!
తలవగానె తలపులలో మెదులును!
చిరునగవులతో జిలుక పలుకులను
చిత్రజగత్తును నడిపేవాడే! ॥అతడే॥

కోరికలేమియు గోరనివాడే!
కోరికలేమని యడిగేవాడే!
ఇహాపరములనూ అంది యిచ్చి మది
నింపులు సొంపులు గుర్చేవాడే!

అతడే నా పతి! యతడే విభుడూ!
అందమైన యా మురళీ లోలుడు!

# నీ గాన మాధురిని !

నీ గాన మాధురిని నే దేలి పోవుదును!
ఆకులో ఆకునై పూవులో పూవై!
పుష్పాచూల దేలుడు పుడమి పులకించినటు
నిర్మలాకాశాన నీలిమలు విసిరినటు!
నీ గాన మాధురిని నే దేలి పోవుదును
ఆకులో ఆకునై పూవులో పూవై!

ఏ మల్లె పొదలలో నే తీగ చాటునో
పాడుచుంటివి కృష్ణ! పరవశము గలిగించి!
నే విరహగీతినై నేల యాకాశాలు
విహరించుచుంటి ప్రభు! వెతనంది నీ కొఱకు!

పాడు టెందుకు స్వామి! పరవశము గలిగించి
నా మనసునను జేరి నర్తించు టెందుకని?
తారలను నే జేరి తళుకుమను టెందుకో!
చంద్రలేఖల గూడి చరియించు టెందుకో!

నా మనసు గూడులో నవనీత! యతికితివి!
నీ పాదముల చెంత నిలిచితిని నీడగా!
విడనిముడి యిది స్వామి! యేనాటి బంధమో!
వరియించితిని కృష్ణ! వరుడవని భావించి!

నీ గాన మాధురిని నే దేలి పోవుదును!
ఆకులో ఆకునై పూవులో పూవై!

## దుఃఖాశ్రు బిందువా !

దుఃఖాశ్రు బిందువా! తుదిలేద నీ బ్రదుకు?
కడలేని యాతనను గంటనుండెదవూ!

రాలిపడవేమి భువి? రమ్యముత్యము రీతి!
చిరయాతనలు మదిని జెదిరి దూరముగాగ!

దుఃఖాశ్రు బిందువా! తుదిలేద నీ బ్రదుకు?
కడలేని యాతనను గంట నుండెదవూ!

మాధవుని విరహమున మదిగ్రుంగి కృశియించి
వేదనల కన్నీరు వెలువరించితి నిజము!
నిండారు కొలనులా నిలిచితివి నేత్రమున
బ్రతిమాలుకొందు నిను బయలుబడుమమ్మ యిక!

మనసు వేదన నుండి మఱి బయలు వెడలితివి!
అవును! నా వేదనకు సంతమే లేదమ్మ
విభుడు రానేరాడు! వేద నది దొలగదూ!
నాతోని నీ వుండి నలత బడబోకమ్మ!

జలజలా బ్రవహించి జారిపడు! భూమిపయి!
లోలోన యింకిపో! లుప్తమై! సుప్తమై!
కనులలో నున్న నిను గాంచెదరు జనులంత
వ్రేలు జూపెదరు నను వేదనకు చిహ్నమని!

దుఃఖాశ్రు బిందువా! తుదిలేద నీ బ్రదుకు?
కడలేని యాతనను గంట నుండెదవూ!

## అచటచట దిరిగేవు !

అచటచట దిరిగేవు! అందాల గోపాల!
నా హృదయ మందిరము నాథ! రారాదా!

పిల్లనా గ్రోవితో అల్లనా బాడుచును
నవరసము లొలికించి నాట్యమాడగరాద!

అచటచట దిరిగేవు! అందాల గోపాల!
నా హృదయము మందిరము నాథ! రారాదా!

అలికి ముగ్గులు పెట్టి అందాల గూర్చితిని
భద్రాసనముతోని భక్తి మందిరమందు!
కుడికాలు పెట్టి నా కోర్కె దీర్పగ రాద!
మధురగీతము వినుచు మైమఱచి పోరాద!

మాధుర్యమును జిందు మధురగీతిక లెన్నొ
మాలగా గూర్చితిని! మాధవా! కిన్నెరను!
బాడుకో వచ్చునట! ప్రణయ గీతము లెన్నొ
ఎవరుండ బోరచట! నీవు నేనే దప్ప!

వేదనను హరియింపు విహరించి మదియందు
కనులలో జేరి నా కన్నీటి నాపుమా!
కంఠమున నిలిచి నా గానమున నీ వుండి
సామగానము రీతి స్వరములను బలికింపు!

అచటచట దిరిగేవు! అందాల గోపాల!
నా హృదయ మందిరము నాథ! రారాదా!

# మధువులను జిందేటి !

మధువులను జిందేటి మధుమాసమిది స్వామి!
చిత్రమైనది జగతి చివురు పువ్వులతో!

ఒకపాట బాడుదము ఓంకార నాదమున
మధుర ప్రకృతిలోని మాధుర్యములు జింద!

మధువులను జిందేటి మధుమాసమిది స్వామి!
చివురు పువ్వులతోని చిత్రమైనది జగతి!

మకరంద పుష్పాదులు మాధుర్యములతోని
అణువణువు పుష్పించి యందాలు జిందినవి!
వనమంత రంగులయి మనసంత రాగమయి
గొంతెత్తి పాడగా గోర్కె జనియించినది!

ఇన్ని యందాలు మఱి వన్నెలిక రావుగద!
కలిసి పాడుదమోయి! కమనీయ గీతమును!
విశ్వగానము నందు వే గలుపు వేణువును
నీ మురళి స్వనములను నే శ్రుతిని గలిపెదను!

కలిసిపాడిన పాట కలకాల ముంటుంది
సంధ్యాకాంతుల వోలె చంద్రలేఖల వోలె!
ప్రకృతిని లీనమై పరవశించే రీతి!
కలిసి బాడుదము సఖ! కావ్యగానము రీతి!

మధువులను జిందేటి మధుమాసమిది స్వామి!
చిత్రమైనది జగతి చివురు పువ్వులతో!

## గాంధర్వ విద్యలో !

గాంధర్వ విద్యలో! కవిత బాడగలేను!
వీణ మీటగలేను! వినువీధి సభలో!

గోప వనితను నేను గోవింద! పల్లియ
పదము పాడెద వినుము! భక్తితో! రక్తితో!

గాంధర్వ విద్యలో! కవిత బాడగలేను!
వీణ మీటగ లేను! వినువీధి సభలో!

కలవారి యింట నే వలచి బుట్టగలేదు!
గాంధర్వ విద్యలను గొగలింపగ లేదు!
అచ్చరల నాట్యాల నలరి నేర్వగ లేదు!
గోప వనితను నేను గోపాల పురమందు!

ఆలమందల మేపు అందాల నీ రూపు
జూచి వరియించితిని సుందరంబగు సొగసు!
పిల్లనా గ్రోవి యా పిలుపులకు నే మురిసి
అర్పించుకొంటి నా యాత్మ సర్వస్వమును!

పేదరాలిని నేను పేదలకు పెన్నిధివి!
ఎవరూ లేరూ నీకు! అగుదు వందఱకునూ!
అర్పించితందుకే! అంత నీకే యనుచు
గుండెలో వికసించు కొసలేని గీతాలు!

పిల్లనా గ్రోవిలో! పిలుపెంత సరసమో!
నా పాటలో కూడ నాథ! సరసము జూడు!
గోప వనితను నేను! గోపాలుడవు నీవు!
అందుకే కుదిరినది! అపురూపు స్నేహమిది!

# ఏమేమొ కోరితిని !

ఏమేమొ కోరితిని! యెన్నెన్నొ కోరికలు!
మనసు చపలముగాన మఱియేమొ కృష్ణా!

మనసులోనున్న నా మధురమైనా కాంక్ష
ఒక్కటే! ఒక్కటే! నిక్కముగ నీప్రేమ!

ఏమేమొ కోరితిని! యెన్నెన్నొ కోరికలు!
మనసు చపలముగాన మఱియేమొ కృష్ణా!

పగలు రాత్రులవోలె బ్రతుకు నడుచుచు నుండు!
సిరి సంపదలు మఱియు సింగారములు గూడ!
నదిని దాటించునది నావలో చుక్కాని!
నీ చేతిలో గలదు నిజము! జగదీశ్వరా!

మమత సమతా గలిగి మానవత వికసించు
మనసు నిచ్చి నాకు మధుర శాంతిని గూర్చు!
విశ్వప్రేమను గలిగి వికసించు బద్మముగ
నా హృదయమును జేసి నాథ! కరుణింపుమా!

నీ ప్రేమ యున్న నాకే ప్రేమ వలదింక
నీ భక్తి యున్న నాకే భక్తి వలదూ!
మనసు గూడున నిలిచి మాధవా! నివసింపు
జన్మజన్మలనయిన చరియింతు దలనెత్తి!
ఏమేమొ కోరితిని! యెన్నెన్నొ కోరికలు!
మనసు చపలముగాన మఱియేమొ కృష్ణా!



శ్రీ ఘుర ?

## పాట విను శ్రీకృష్ణ !

మాటవిను! శ్రీకృష్ణ! పాట విను కృష్ణా!
మనసులో నున్న నా మధురమౌ కాంక్షా!
పంచభూతములలో బడిపోక ముందుగనె
నా మనసులో పాట నాథ! వినవలెనోయి!
మాటవిను! శ్రీకృష్ణ! పాట విను కృష్ణా!
మనసులో నున్న నా మధురమౌ కాంక్షా!

ఎన్నాళ్ళనుండియో ఏర్చికూర్చితి నోయి!
మధుర పదములతోని మంజులంబగు గీతి!
కన్నారగాంచి నే విన్నపము జేయగా
మనసుననె దాచితిని మఱియెవరు వినకుండ!

మనసునను నిను దలచి మధురభక్తిని నిన్ను
పూజింప ప్రార్థింప బులకలను బొందగా!
మధురగీతములతో మైమఱచి ప్రార్థింప
విన్నపము జేసితిని! సన్నగా! జాలిగా!

కోనలో దూరాన కోకిలలు బాడినటు
గూటిలో గువ్వజత కువకువలు బలికినటు!
సెలయేటి సవ్వడిని శిలలలో స్పందనగ
వినిపింతు వినుమోయి! విమలమగు నా పాట!

ప్రాణప్రయాణమున బలుకు బలుగ లేను!
గొంతెత్తి పాడగా గోరి కెటు బోవునో!
అందుకే నా పాట యాలరి వినుమో కృష్ణ!
మతి యుండగనె నాదు మనసులోని పాట!

# నిను జూడగా కృష్ణ !

నిను జూడగా కృష్ణ! నిఖిలలోకం బంత
వెన్నెలల పువ్వులై విరులు కురిసేనూ!
అరవిరిసినా కలువ అందాల సిగ్గులై
నా మనసు దూగాడు నవనాట్య భంగిమల!

నిను జూడగా కృష్ణ! నిఖిలలోకం బంత
వెన్నెలల పువ్వులై విరులు కురిసేనూ!

విదియ చంద్రుని మల్లె వేడుకను నా మదిని
తొంగి జూతువదేల తోరంపు ప్రేమతో!
నా వలపు మల్లియలు నటియించి పందిరిని
జలుజల్లుమని రాలు పులకరించుచు పుడమి!

సంజకేకకు వోలె సరసముగ నను జూచి
చిరునవ్వు నవ్వేవు సింగార మొలికించి!
కనులలో కాటుకలు కరిగి నీరయిపోవు
హార్ష భాష్పములతో ఆనంద లహరిలో!

కన్నులకు గనిపించి కలత గలిగింపకుము
మనసులో నడయాడి మధురిమలు నింపకోయ్!
మరుభూములకు బోదు మన్నింపు శ్రీకృష్ణ!
నా వెంట రాకోయి! నను జ్వాల ముంపకోయ్

నిను జూడగా కృష్ణ! నిఖిలలోకం బంత
వెన్నెలల పువ్వులై విరులు కురిసేనూ!

## సుందరంబయిన !

సుందరంబయిన యీ సృష్టి చిత్రాలన్ని
గానమే చేస్తాను! గాంధర్వ కళనూ!
అందాల లీనమయి యానంద జగతినీ
మధురగీతము బాడి మైమఱచిపోతాను!
సుందరం బయిన యీ సృష్టి చిత్రాలన్ని
గానమే చేస్తాను! గాంధర్వ కళనూ!

కోనలో కోకిలలు 'కూ'యనగ పరువెత్తి
పాటందు కుంటూను బరవశము జెందుతూ!
సెలయేటి పాటలో గలగలా జత కలిపి
వలపు పాటలుబాడి వన్నె లొలికిస్తాను!

ఆకాశమంతటా యలరి మబ్బులగుంపు
చల్లనీ గాలులూ పల్లవించిన యపుడు!
వచ్చనీ పచ్చికల బయలంత బరువెత్తి
హరివిల్లులో గలియ నారాట బడతాను!

వెన్నెలా రాత్రులను వినువీధి గాంచుచును
సన్ననీ ధ్వనులేవో సరసముగ వినుచుందు!
చంద్రకాంతుల జాలు జలజలా జారినటు
తడిసిపోయిన యటుల తన్మయము నొందుదును!

ఈ సృజనమంతయును ఈ విలాసము లన్ని
నా కోసమే యంచు నాథ! మది దలచెదను!
అణువణువు నీ సృజన యాత్మాభిరామమున
కలిసిపోవగ నన్ను కరుణింపు గోపాల!

## అంత ప్రేమున్నదని !

అంత ప్రేమున్నదని కాంతునకు నాపైని
చింతలను మునిగి నే నింత గననైతి!
కనులుండి విభుని నే గానజాలకపోతి!
గోరింక చెప్పినది కోమలీ! నిజముగా!
అంత ప్రేమున్నదని కాంతునకు నాపైని
చింతలను మునిగి నే నింత గననైతి!

మల్లెపూ పొదలోన మాధవుని మనసులో
చింతించి విరహమున కాంత! నే నిదురింప!
తుమ్మెదగ దా నొచ్చి తూలుతూ పొదరింట
నను జూచి పోయెనట నళినాక్షి! నిజముగా!

కోనలో నేజేరి కోరి హరి చిత్రమును
రంగులను గీసేటి రమణీయ సమయమున!
కోకిలగ దావచ్చి కుదురుగా ననుజూచి
'కూ'యంటుపోయెనట! కూర్మి యెంతటిదో గద!

బాలెంత రూపాన! బాలకుని రూపాన
భిక్షుకుని రూపాన! బీదగా! సాదగా!
నా యెదుట నిలిచెనట! నను భిక్ష యడిగెనట!
గమనింప లేనయితి! గారవింపకపోతి!

అంత ప్రేమున్నదని కాంతునకు నాపైని
చింతలను మునిగి నే నింతగననైతి!

# మనసు చెదరకముందు !

మనసు చెదరకముందు! మాటయాగకముందు!
ఆనాటి ముందువిను! అలరి నా పాటా!

మధుర గీతము నోట మఱచిపోవక ముందు
నీ మీద నా ప్రేమ నిలిచిపోవక ముందు!

మనసు చెదరకముందు! మాట యాగకముందు!
ఆనాటి ముందు విను! అలరి నా పాటా!

చిఱునవ్వుతో నిన్ను చెలగి కృష్ణా యనుచు
తెనుగు బాసను బిలుచు తెలివాగి పోకమును!
ముత్యాల సరములను ముద్దులొలికే గీతి
మనసు బాడగలేక మఱి మూగి గాకమును!

వాల్మీకి వ్యాసు లలి వరుసగా భారతిని
రామకృష్ణులపాట రమ్యముగ పాడినది!
నా తెనుగు బాసలో నా నోట బలికింప
ఆదరింపుము స్వామి! యది భాగ్యమని దలతు!

మధురభావాలు మది మర్మముగ దూరమయి
గీతి నిర్మాణమున గిరి దాటి బోకమును!
సుందరాకార! నీ సురుచిరము గనలేక
కనులు మూతలు వడెడి కాలగతి రాకమును!

మనసు చెదరకముందు! మాటయాగక ముందు!
ఆనాటి ముందు విను! అలరి నా పాటా!

## వీధి గాయకుడనయి !

వీధి గాయకుడనయి వీధులను దిరుగుచును
హరికీర్తనల జనుల నలరింప కాంక్షా!
మధుర కంఠముతోని మాధుర్య మొలుకుచును
చైతన్య దీపికల జతగూర్చ జాగృతిని!
వీధిగాయకుడనయి వీధులను దిరుగుచును
హరికీర్తనల జనుల నలరింప కాంక్షా!

భూమితల్లిని దున్ని పులకించి కర్షకులు
విశ్రాంతి గొనువేళ వేగమే దరిజేరి!
మధుర గీతము బాడి మైమఱపు గలిగించి
క్రొత్త లోకంబునకు గొనిపోవ నా కోర్కె!

పొగలలో యంత్రాల పూనికను శ్రమియించి
పనిజేయు శ్రామికుల పట్టునకు దరిజేరి!
ఉత్సాహమును గూర్చి యుల్లాసమున దేల్చి
మమత సమతా ప్రేమ మదిని జిందింపగా!

ఇంటింటికిని దిరిగి వెంట బాలురు రాగ
తీయనీ పాటలను దేనె లొలుకుచు బాడి
ఇల్లాండ్ర భిక్షలను నింపుగా గైగొనుచు
బ్రతుకు గడపాలంచు ప్రబలమగు నా వాంఛ!

పాట నిచ్చితివి మఱి పదములను గూర్పగా!
మధుర కవితను నొసగి మర్యాద జేసితివి!
మనసు వశబఱచుకొను మధురకంఠమునిచ్చి
మురళిలోలా! నాదు ముద్దు దీర్పగ దోయి!



శ్రీ ము ర ళి

## చుక్కలకు పైపైని !

చుక్కలకు పైపైని సూర్యచంద్రులపైని
నిలిచినా స్వామి! నీ నీడ కెటులొత్తూ?

ఆత్మతోగూడ నీ కర్పించితిని స్వామి!
నిను జేరు టెట్టులో నింగి నీలముపైకి?

చుక్కలను పైపైని సూర్యచంద్రులపైని
నిలిచినా స్వామి! నీ నీడ కెటులొత్తూ?

బహుదూరమని తెలియు బాధయని తెలియునూ!
మలుపులెన్నో దిరిగి మఱి నిన్ను జేరవలె!
ఆగిపోలేను మఱి యాశలు నిరాశగా!
కడదాక యత్నింతు గాంచగా నీరూపు!

ఒక్కొక్క మెట్టుపై యొనర పాదము పెట్టి
మబ్బు పొరలను దాటి మాధవా! పయనింతు!
మౌనగీతము హృదిని మారుమ్రోగుచునుండ!
వరమాల జేబూని వచ్చెదను పై పైకి!

ఎన్ని జన్మలలోన నిన్ను దరిజేరుదునో!
కల్యాణమంటపము కడ కెటుల వత్తునో!
అప్పుడయిన కరుణతో నాదరింతువో లేదో!
ప్రేమ భిక్షను బెట్టి ప్రీతిగాంతువో లేదో!

చుక్కలకు పైపైని సూర్యచంద్రుల పైని
నిలిచినా స్వామి నీ నీడ కెటులొత్తూ?

## మాట లేకను!

మాటలేకను పాట లేకను
మనసులో యీ మౌనమెందుకు?
  మధు వసంతమునందు గూడను
  మౌనమేలనో కోకిలమ్మకు?
మాటలేకను పాటలేకను
మనసులో యీ మౌన మెందుకు?

అంత విరహ మదేల కృష్ణుని
చింతలోబడి మునిగిపోవుదు!
కవిత మనసా కలముతో ఒక
కమ్మనయినా గీతి వ్రాయుము!
ఎక్కడో మఱి లేదు కృష్ణుడు
ప్రక్కనే యున్నాడు గనుగొను!
విశ్వమోహన మురళితో తన
విమల గానము నాలపించుచు!

కొమ్మకొమ్మను తీవె తీవెను
కోటి యందా లతనివే సుమ!
మంజులంబగు నిస్వనంబుల
మహిమలన్నీ యతనివేగా!

ఉదయ సంజల వెలుగులను నీ
మదిని నింపుము వేడుకలరగ!
ప్రాణిలో ప్రతి ప్రాణిలో యీ
ప్రకృతి యంతట గలడు కృష్ణుడు!

# రాత్రి గడిచెను చాల !

రాత్రి గడిచెను చాల! రమ్యసుందర శ్యామ!
రావేల గృహమునకు రమణీయముగనూ!

ఎటుబోతివో యేమొ! యే మూల వెదుకుదును?
కొండలను కోనలను కోనలందు శిఖరాల!

రాత్రి గడిచెను చాల! రమ్యసుందర శ్యామ!
రావేల గృహమునకు రమణీయముగనూ!

ఏ నదీ తీరాల యే కొండ గుట్టలను!
ఏ యడవు లందునో! యే పూల దివెలను!
మురళి మ్రోయించుచు మోదమున నుంటివో!
నిను వెదుక బంపినది! నిఖిలేశ! నా గీతి!

నీవు లేకను నొక్క నిమునమైనను గూడ
మది తాళ లేననుచు మఱి నిలువ లేననుచు!
ఉత్కణ్ఠను నిచ్చి యొకచేత దీపమును
నిను వెదుక బంపినది! నిశిరాత్రి నిఖిలేశ!

మనసు వలపులు నింపి మధువులను గురిపించి
తెరలేల వేసెదో! తెలుపుమా గోపాల!
నా గీతి ప్రాణమును నయముగా నిలుపుమా!
నా శ్రమను కడజేర్చి నను గృహము జేర్పుమా!
రాత్రి గడిచెను చాల! రమ్యసుందర శ్యామ!
రావేల గృహమునకు రమణీయముగనూ!

# అడ్డెవరు నిలువక్కడు !

అడ్డెపరు నిలుపకుడు! ఆతడొచ్చే వేళ!
వత్తునని కబురంపె వల్లభుడు నేడూ!

మధ్యలో నాపకుడు మధుర భాషణములను
తీయనీ పాటలను దేనె లొలుకుచు వాని!

అడ్డెవరు నిలువకుడు! ఆతడొచ్చే వేళ!
వత్తునని కబురంపె వల్లభుడు నేడూ!

మలిసంజ కుంకుమలు మాటుమణిగే వేళ
తెలి తారకలవి మింట తొంగి చూచే వేళ!
కోవెలను శంఖాలు గూడి మ్రోగే వేళ
నా విభుడు కబురంపె నయముగా వత్తునని!

చిలుక గోరింకలూ చిన్నారి పిట్టలూ!
మావి కొమ్మలచాటు మధుర కోకిల లార!
మల్లె మాలతులార! మాధవీ లతలార!
ప్రియవాక్యముల వాని ప్రేమ నాపకుడమ్మ!

కలకాలమతనికై కాచిచూచుచు నుంటి
రాత్రిబవళులు నిలిచి రమణీయ శిల్పముగ!
దీపమున దీపమై తేజరిల్లగ నేను!
నను గలియనిండమ్మ నా ప్రాణ ప్రియు వేగ!

అడ్డెవరు నిలువకుడు! అతడొచ్చే వేళ!
వత్తునని కబురంనె వల్లభుడు నేడూ!

# నీవు నింగిని మురళి

నీవు నింగిని మురళి నిలిచిపాడాలంట!
నాగీతిధరణిపై నాట్యమాడాలంట!
మధురగీతముబాడ మఱి వర్ష ధారలను
పుడమి సస్యములతో పులకరించే నంట!
నీవు నింగిని మురళి నిలిచిపాడాలంట
నాగీతి ధరణిపై నాట్యమాడాలంట!

ఉఱుములను మెఱుపులను ఊగి ప్రకృతియంత
తాళమును వేయునట! తన నాట్యభంగిమల!
వర్ష ధారలతోని వయ్యారములతోని
మెఱుపులా దిరుగునట! మేదినీ యంతటను!

పచ్చనీ పచ్చికల పసిడిమైదానములు
తెల్ల నీపాదాల దేలుతూ దిరుగుచూ!
వర గీతము బాడి హర్షమున జగమంత
వన్నెలను గూర్చునట! వగలాడి! నాగీతి!

సస్యశ్యామలముగా దగధరణి గావించి
ప్రీతజగతిని జేసి కోరికలు నెరవేర్చి!
నిను జేరవచ్చునట! నిండుజవ్వనిబోలె
పతిజేరవచ్చేటి సతివోలె రివ్వుమని!

నీవునింగిని మురళి నిలిచి పాడాలంట!
నాగీతి వసుధపై నాట్యమాడాలంట!

# పూ దీవెలార!

పూ దీవెలార! మన పుణ్యాలు ఫలియించె!
వత్తునని కబురంపె వల్లభుడు నేడూ!

మనసార పుష్పాదుల మధువులొలుకుదు నేడు
మాధవుడు ధరియించు మనమిచ్చు పూమాల!

పూ దీవెలార! మనపుణ్యాలు ఫలియించె!
వత్తునని కబురంపె వల్లభుడు నేడూ!

అరవిరసినా పూల నన్నిటిని జతగూర్చి
మాధవుని కర్పింప మాలగ్రుచ్చుచునుంటి!
వచ్చునని గోపాలు నెదురుజూచుచురోజు
కనురెప్ప వేయకను గాంచుచుంటినిగదా!

గ్రుచ్చినాపూదండ గుండెజెలువవ్వగా
వాడిపోవుచునుండె వల్లభుడు రాడాయె!
కన్నీరు దాపుకొని కలగుండు మ్రింగుకొని
మనసు రాయినిజేసి మసలితిమి యిన్నాళ్ళు!

బహుకాలమునకు మన బాంధవుడు వచ్చేని
పూమాలవేయుదము! పులకరింపగ మనసు!
అలనాటి శబరిలా యారాములకు నిచ్చు
వన్యఫలములకు వలె వరుస హారికిచ్చుదము!

పూదీవెలార! మనపుణ్యాలు ఫలియించె!
వత్తునని కబురంపె వల్లభుడునేడూ!

## కనిపించినాసరే!

కనిపించినాసరే! కనిపింపకున్ననూ!
మనసునందున నిలువు! మాధవా! దయతో!

నినువిడిచి ఒకక్షణము నే నిలువలేనోయి!
గతజన్మబంధమిది! కాదనకు! లేదనకు!

కనిపించినాసరే! కనిపింపకున్ననూ!
మనస్సునందున నిలువు! మాధవా! దయతో!

పలుకులో పాటలో పదమునందున నిలిచి
తూగింపుచూ మనసు! ఉయ్యాల! జంపాల!
కొలనులో గలువగా! కోకిలాపాటలా
వినిపించి పాడనీ! వినువీధులంతటను!

చంద్రకిరణముల వలె! సంజవెలుగుల వోలె!
కమనీయశోభలను గాంతులను జిందనీ!
హేమంతమునవిరియు హిమబిందువులకువలె
నామనసువిప్పారి నాట్యాలుచేయాలి!

ఎదురుజూచుచునుందు వేలాది జన్మలను!
కనిపించినప్పుడే కాంచెదను కనులార!
అందాక నామనసు నంచులను నిలుచుండి
నాథ కిగీతాల నయముగా వినుమోయి!

కనిపించినా సరే! కనిపింపకున్ననూ!
మనసునందున నిలువు మాధవా! దయతో!

## వసుమతీ చక్రమా!

వసుమతీచక్రమా! వన్నెలను వికసింపు!
విభుడొచ్చుచున్నాడు! వేల కాంతులతో!
మురళి చే నూదుతూ మురిపాలు చిందుతూ!
కన్నార ననుగాంచి కనికరించుటకునై!
వసుమతీచక్రమా! వన్నెలను వికసింపు
విభుడొచ్చుచున్నాడు! వేలకాంతులతో!

అందాలు జిలికింపు! అణువణువు బులకింపు
బయలంత వికసింపు! పచ్చనీ పచ్చికల!
వాసంతి కుసుమాల వలనొప్ప జల్లుమా!
మెత్తనీ హరిపదము లొత్తుకోనకుండగా!

నీమధుర ప్రకృతిని నిండార వెలుగొంది
చల్ల గాలుః తోని చంద్రకాంతులతోని
చిలుక గోరింకలను చెన్నారహంసలను
కోకిలల గుంపుతో గూడి స్వాగత మిమ్ము!

వరమాల ధరియించి వరియింపగా విభుని
విమలగీతముతోని వేడుకను బాడుచును!
దివినుండి భువికిదిగు దివ్యపురుషునికిపుడు!
స్వాగతం బీయుదుము సర్వమును నర్పించు!
వసుమతీచక్రమా! వన్నెలను వికసింపు!
విభుడొచ్చుచున్నాడు! వేలకాంతులతో!

# ఎటనుందువో !

ఎటనుందువో నీవు! ఎవరితో నుందువో!
మాధవా! నీ గుట్టు మఱి నాకు దెలిసే!
విప్పి చెప్పినదోయి వీనులకు విందుగా
అరమరిక లేకుండ యీచిన్ని గోరింక!
ఎటనుందువో నీవు! ఎవరితో నుందువో!
మాధవా! నీగుట్టు మఱి నాకు దెలిసే!

చిన్ని చిగురాకులను వన్నెలా పువ్వులను
వనవీధులందునా వగలు జిందుదువంట!
కొండ శిఖరములందు కోలని గట్టుయందు
సెలయేటి జాలులను శిలలందు నిలుతువట!

వేదనల యిడుములను వెతలు పొందేవారి
కన్నీరుగా నీవు గలత బొందుదువంట!
అన్నార్తులందు నీ వాకలిగ నిలుచుండి
వేదనను బొందుచూ విలవిల దపింతువట!

పిలువకున్నను బలికి ప్రీతి గూర్చెద వంట!
ప్రేమింపకున్ననూ ప్రేమించు వాడవట!
పాటంటె వేడుకట పన్నీరు జల్లుగా
పలుమారు బిలువగా ప్రాణ మిచ్చెదవంట!
ఎటనుందువో! నీవు ఎవరితో నుందువో!
మాధవా! నీ గుట్టు మఱి నాకు దెలిసే!

# ఆలపించుచు నుంటి !

ఆలపించుచునుంటి యారాధనా గీతి!
విలపించు పక్షిలా వినువీధిలోనా!

వాడి బాణముదాకి పడినేల బడక మును
కరుణతో గాపాడు! కన్న తల్లి ప్రేమ!

ఆలపించుచు నుంటి యారాధనా గీతి!
విలపించు పక్షిలా వినువీధిలోనా!

కొండలన్నిదాటి కోనలన్ని దాటి
నీ పాద సన్నిధిని నిలిచితిని గోపాల!
పాట యాగకముందు ప్రణయ మాగక ముందు
తీయగా నను జూచి తేన లాలుకుము కృష్ణ!

అలసిపోతిని స్వామి! యారాధనలతోని!
బడలిపోతిని కృష్ణ! పాద పూజలతోని!
తీయనీ నీ మురళి తేనె లాలికించి యొక
కమ్మనీ రాగాన గడ దేర్పుమా కృష్ణ!

అలలవలె సన్నిధిని యాటుపోటుల వోలె
నిను బొంద కాంక్షించి నీరసించితినోయి!
మనసులో నా గీతి మాటు మణగకముందు
జ్యోతిలో నను గలిపి ప్రీతి గూర్పుము కృష్ణ!

ఆలపించుచునుంటి యారాధనా గీతి!
విలపించు పక్షిలా వినువీధిలోనా!

# ఉదయ తారకువోలె !

ఉదయ తారకువోలె నుదయించి నామదిని
మధుర గీతము బాడ మమత గలిగింపూ!

సంజ కెంపులకువలె సరసతను గలిగించి
విశ్వ సౌందర్యమును వికసింప జేయుమా!

ఉదయ తారకువోలె నుదయించి నా మదిని
మధురగీతము బాడ మమత గలిగింపూ!

ఆకులో చివురులో అందాల పూవులో
ప్రేమ తత్త్వము దెలిసి ప్రీతి నుప్పొంగగా!
ప్రకృతిని లీనమయి పారవశ్యము జెంద
అణువణువు నందునను నాత్మేశ్వరుని గాంచ!

పేదగా జనియించి పేదగా నే బెరిగి
పేదగా నినుజేర ప్రియమైన నా కోర్కె!
ఆడంబరము వీడి యమృత వాక్యములతో
మనసార మాటాడ మధురతను దయజేయి!

పెనుపోమరికి వోలె పెద్దకాలము దాక
దీనత్వమున కృష్ణ! దినము గడపగలేను!
కర్మవీరునిగ నను గడదేర్పవలెనోయి!
పరులకయి నా బ్రదుకు బన్నీరు గావలెను!

ఉదయతారకువోలె నుదయించి నా మదిని
మధుర గీతము బాడ మమత గలిగింపూ!

## కూర్పలేదమ్మ!

కూర్పలేదమ్మ! నా గోపాలబాలునీ!
మణిభూషణములతో! మాణిక్యములతో!

కనకాంబరములతో గరుడవాహనముపై
నిలుపలేదమ్మ! నా నీలమేఘశ్యాము!

కూర్పలేదమ్మ! నా గోపాలబాలునీ!
మణిభూషణములతో! మాణిక్యములతో!

నెమలి పింఛము నొకటి నెమ్మోముపైనుంచి
చేతి కందించితిని చిన్నారి మురళినీ!
చిఱుగజ్జియలు గట్టి చిందింప నాట్యముల
మధురహాసముజేయ మమతతో నేర్పితిని!

చిన్నారి కోకిలల చిలుక కోకిలలతో
ఆడగా పాడగా నతివ! నేర్పితినమ్మ!
ఆలమందల మేపు నలరు బాలకులతో
గూర్మి దిరుగు మటంచు గుదురుగా నేర్పితిని!

మమత చిగురించేటి మాధుర్యములు జిందు
పాటలను వినునట్టి పరమ పురుషుని జేసి!
కొలుచుచుంటిని సఖి! కోరికలు లేకుండ!
పులకించుచుంటినీ! పురుషోత్తముని జేసి!

కూర్పలేదమ్మ నా గోపాలబాలునీ!
మణిభూషణములతో! మాణిక్యములతో!

# పాటలో వేదనను

పాటలో వేదనను బరికింతువని కాద!
పాట బాడితి స్వామి! పడిలేచు అలగా!
కన్నీటికాలువలు గడలిలో గలిసినవి!
కరుణ రాదాయె కద! కమ్మనీరాగాన!
పాటలో వేదనను బరికింతువని కాద!
పాటబాడితి స్వామి! పడిలేచు అలగా!

నీకు నాకును మధ్య నిలిచినా పెనుగోడ
తొలగింపుమూ యనుచు దోరముగ పాడితిని!
తెరను దొలగింపుమని చెఱను విడిపింపుమని!
వినయముగ జేసితిని యెన్నెన్నొ వినతులను!

నీ వెలుగు కాంతిలో నేనొక్క కిరణమని
నీ పూలబాటలో నేనొక్క పువ్వునని!
ఒకనాటి సహచరిని! యోరిమిని యుంటినని!
మాటనమ్మవు! నాదు మనవి వినవెందుకో!

పాటబాడుచు నిటుల బయనింతు నెన్నాళ్ళు!
కొండ లడవులుదాటి కోనలను దర్శింతు!
రాళ్ళు గూడను దయను రాగాలు దీసినవి!
నీ మనస దెందుకని నిలిచినది లోహముగ!

పాటలో వేదనను బరికింతువని గాద!
పాటబాడితి స్వామి! పడిలేచు అలగా!

# కన్నార నను జూచి

కన్నార నను జూచి కనికరించినగాని
కసిదీర బెదిరించి కడకు ద్రోసిననూ!

ఎన్ని జన్మల నిటుల వేధించినాగాని
నిను మరువ నెన్నటికి నిఖిలాత్మ! నిశ్చయము!

కన్నార నను జూచి కనికరించినగాని
కసిదీర బెదిరించి కడకు ద్రోసిననూ!

తారగా నను జేసి తగదూర ముంచినను
ఆకాశవీధిలో నలరింప జేసినను!
నాతళుకు మిలమిలలు నాకాంతి కిరణాలు
నీపాదములనంట నిశి బవలు యత్నింతు!

వనరేఖగా జేసి వన్నెలన్నీ మాపి
దూరదూరాన నను దురపిల్ల జేసినను!
నిక్కి జూతును స్వామి! నేల యంచులనుండి
కరవశముగా నీదు పాట బాడుచు కృష్ణ!

నను మఱచిపోయినా నాథ! నిను మరువనూ!
మనసునను నిను నిలిపి మధుమాస భ్రమరముగ!
తూలి బాడుదు నీదు తుదిలేని పాటలను
క్రొత్తపదములతోని క్రొంగ్రొత్త రాగముల

కన్నార నను జూచి కనికరించినగాని
కసిదీర బెదిరించి కడకు ద్రోసిననూ!

# పిలిచిపిలిచీ కృష్ణ!

పిలిచిపిలిచీ కృష్ణ! వలపుపాటలతోని
మనసంత యల్లుకొను మల్లితీవెయగా!
పులకించి భావాలు పూవులయి పుష్పొదుల
రంగవల్లులు దీర్చె రమణీయ వనవీథి!
పిలిచిపిలిచీ కృష్ణ! వలపుపాటలతోని
మనసంత యల్లుకొను మల్లితీవెయగా!

చుక్కలను దివియంత సుందరంబగురీతి
మధురభావాలతో మానసము నిండినది
చిన్నిపాటను బాడ జిఱునవ్వు నవ్వెదవు!
ఎటులగూర్తును స్వామి వేలభావాలతో!

తీయనీ తేనియల దీవులను బండేటి
తెలుగు పలుకులునిండె దీరుగా హృదయాన
ఏపదములను గూర్తు నింపయిన గీతిగా
కోటిదీపాలతో కుదురుగా నొకచోట!

పాటగూర్పగ లేను పదము బాడగలేను
అలసిపోతిని స్వామి! యందాల రాగాల!
పాటగా నే మారి ప్రతిమగా నిలిచితిని!
మురళితో స్పృశియింపు మోదములు బండగా
పిలిచిపిలిచీ కృష్ణ! వలపుపాటలతోని
మనసంత యల్లుకొను మల్లితీవెయగా!

## రాతిలో నిను జూతు

రాతిలో నినుజూతు రమ్యమోహన మూర్తి
ఆకులో పూవులో అంతటా జూతూ!

ఉలిని జెక్కగనేల? ఉన్నరూపును మాపి
రంగులవి యేలనో రమణీయమూర్తికి!

రాతిలో నిను జూతు రమ్యమోహనమూర్తి
ఆకులో పూవులో అంతటా జూతూ!

ఉలితోని నిను దీర్చు ఉర్విశిల్పుల జూచి
నామనసు నీరగును నాగుండె వ్రయ్యలగు!
ఉలితాకుడులకెటుల నోర్వగలవో యంచు
సెలయేటి తరగలా తల్లడిల్లుదు స్వామి!

రంగులను పులిమి నీ రమ్యసుందరమూర్తి
మాధుర్యమంతయును మటుమాయమును జేయు
చిత్రకారులజూచి చింతిల్లుచుండుదును
అందగానికి యెంత యగచాటు లొచ్చెనని!

అణువణువులోనున్న అందాల శ్రీకృష్ణ!
ఉలితోని నినుజెక్కి యుసురువెట్టగనేల?
ప్రకృతి వికృతి జేసి పావనంబయిన నీ
రూపు మాపిరి జనులు లోలత్వమును జూపి!

రాతిలో నిను జూతు రమ్యమోహనమూర్తి
ఆకులో పూవులో అంతటా జూతూ!



శ్రీ మురళి

# నే పాట పాడగా !

నే పాటపాడగా నిఖిలమంతా కదిలి
ఆనంద హర్షాల నటు పులకరించి!
రాళ్ళన్ని కదులుతూ రాగాలు తీసినవి
శిలలు తాళము వేసి చిరునవ్వు నవ్వినవి!
నే పాట పాడగా నిఖిలమంతా కదిలి
ఆనందహర్షాల నటు పులకరించి!

గొంతెత్తి నే పాడ కొసపూలు రాల్చినవి
పూలతలు ఊగుతూ తావులెల్లను చిందినవి!
చిలుక గోరింకలూ చిన్నారి కోకిలలు
స్వరము స్వరమూ కలిపి సరిగమలు పాడినవి!

తెలియకుండగ నీదు తీరుగా శ్రీమురళి
మధుర నిస్వనములను మాధుర్య మొలికినది!
అలరి నీ చిరుగజ్జె అందాలు చిందగా!
మధుర నృత్యము జేసె మాధుర్యములు పొంగ!

కొండలను నే పాడ బండలన్నియు స్పాడ
శిలలు శిల్పాలయ్యె చిత్రమ్ముగ యొకట్లొకటి
కదిలి నా పాటలను కమలమ్ములు వికసించె
మాధవీలత గూడ మాటాడ సాగినది!

నా పాట మెచ్చుకొని నన్నాదరింతువా!
మురళి మ్రోగించి నీ మోహమును దెల్పుదవా!

# నీ ద్వారమున జేరి !

నీ ద్వారమున జేరి నిలిచి యాచించేటి
దాసి కోరిక దీర్చి దయజూడు కృష్ణా!
కోరనీ కోరికల కొసరి పంపించేవు
మనసులో నున్న నా మధురకోరిక నీర్పు!
నీ ద్వారమున జేరి నిలిచి యాచించేటి
దాసి కోరికదీర్చి దయజూడు కృష్ణా!

భూషణాంబరములను బోలుపుగా గనూరి
మాట వరుసకు నయిన మతి యడుగ లేదోయి!
రత్నాల హారమును ముత్యాల ఉంగరము
జతజేసి పంపమని మతి గోర లేదోయి!

పంపుచుంటివిగాని పలుమారు దయతోని
యంటి ముట్టుట లేదు! ఆడంబరములన్ని!
మనసునందున్నట్టి మాధవా! నా కోర్కె!
నీకు తెలియును స్వామి! నిఖిలాత్మకుడ వీవు!

ప్రేమ భిక్షను దప్ప ప్రీతినెద్దియు గూడ
స్వీకరింపను స్వామి! చిరదాసి కోర్కె-యిది!
జన్మ జన్మల భక్తి జాలువారిన దిటుల
అందుకొను ప్రేమతో నాత్మీయతను విరిసి!
నీ ద్వారమున జేరి నిలిచి యాచించేటి
దాసి కోరిక దీర్చి దయజూడు కృష్ణా!

## బాటసారీ !

'బాటసారీ! పయన మెచటికి?
బాటసారీ! గమ్య మెచటికి?
ఒంటరిగ నీవెచటికో మఱి
జంట నేనును వత్తునా?'
మాటలాడక బాటసారీ!
మౌనముగ ముందునకు నడిచెను!
అగ్గి కురిసే మంటుటెండను
ఆటుల యుగుడులు వేయుచున్!
మఱల నడిగితి మోరసాత్రీ
మోదమున నీ వెచటి కనుచును!
తిరిగి జూచీ యరుగసాగెను
చిత్రముగ మున్ముందుకున్!
దారి కడుగ నిలిచి యడిగితి!
దరికి జేరి మోరసాత్రీ
'అచ్యుతుని గలియంగ బోవుట
యడ్డురాకని బలుకగన్!'
'నేను వచ్చెద!' ననుచు బలుకగ
'కొండ లుండును! కోన లుండును!
మండుటెండలు! వర్ష ధారలు!
మంచు చల్లని గాలులున్!
అన్నిటికినీ సిద్ధమైతే
యలరి రమ్మ'న బాటసారీ!
'అట్టులే' యని వెంట నడిచితి!
యడుగులందున యడుగులన్!

## కనుమూసినా గాని!

కనుమూసినా గాని కను దెఱచినాగాని
నీ రూపమే కృష్ణ! నిండు కన్నులనూ!
 వినిపించు నీ మురళి విమల నిస్వనములూ!
 పాటబాధించు నను పారవశ్యముతోని!
కనుమూసినాగాని కను దెఱచినా గాని
నీ రూపమే కృష్ణ! నిండు కన్నులనూ!

వెన్నెలలు వికసించి వేయి రేకలు జారి
కలువ పూవులపైని కలిసియాడిన యటుల!
తుమ్మెదలు వనవీథి తూలిపాడిన యటుల!
నా గీతితో పాడు నాథ! నీ శ్రీమురళి!

హంసబారులు వరుస యాకాశ వీథిలో
పయనించి పోవునటు జలు జిత్రగతులతో!
స ప్తస్వరము లనెవుడు సంగీత స రనల
కదిలించునెవ్వాడును కలకలా శ్రీమురళి!

ఇన్ని చేతువుగాని విన్నపము వినవేమి?
గాఢమైనా హృదయ కాంక్ష దీర్పవదేమి?
కలుపుకోవేమి నీ కమనీయ జ్యోతిలో
నిలుపుకోవేమి నీ నీడలో శ్రీకృష్ణ!
 కనుమూసినా గాని కను దెఱచినా కృష్ణ
 నీ రూపమే కృష్ణ నిండు కన్నులనూ!

## నీవు లేనిది కృష్ణ !

నీవు లేదని కృష్ణ! నిముస ముండగ లేను!
నిను మఱచి యొక క్షణము నిలువ జాలనుగా!

మధురమగు నీ గీతి మాధుర్యమును వీడి
బ్రతుకలే నోయ్ జగతి బరు వగును జీవితము!

నీవు లేనిది కృష్ణ! నిముసముండగ లేను!
నిను మఱచి యొక క్షణము నిలువ జాలనుగా!

కమనీయ సంజలను కాంతి విరబూసినటు
నీలోనె నా బ్రతుకు నిండి యుండినదోయి!
శశిలోన జంద్రికలు జాలువారిన యటుల
నీ వెనుక బయనింతు! నీడలో నీడగా!

నా కున్నదంతయును నాథ! యర్పించితిని
అంతరాత్మయుగూడ నర్పించితిని స్వామి!
అమ్మ కొంటివి నన్ను అలరి బానిస నయితి
ఎటనుండు మనెదవో! నట నుండెదను స్వామి!

మాట లాడించెదో! పాట పాడించెదో!
న ర్తకిని జేసి నను నాట్యమాడించెదో!
శ్రీలు విరబూయగా శిల్పముగ ననుజేసి
అలికించు కొనెదవో! అందాల కోవెలను!

నీవులేనిది కృష్ణ! నిముస ముండగ లేను!
నిను మఱచి యొక క్షణము నిలువ జాలనుగా!

# చిగురాకులను మేసి !

చిగురాకులను మేసి చిన్నారి కోకిలా!
పాటబాడినదోయి! బరవశము జెందా!

నా మనసు పులకించి నవతాళ రాగముల
లలిత గీతము బాడె లాలిత్య మొలుకగా!

చిగురాకులను మేసి చిన్నారి కోకిలా!
పాట బాడినదోయి! బరవశము జెందా!

రంగు రంగుల కాంతు లంబరము నిండెనూ!
వన్నె చిన్నెలు నిండె వనవీధి నంతటను!
పుష్పాదులు రాల్చుచును! పూదేనె ద్రావుచును
తుమ్మెదల నాట్యములు దోరముగ జెలువారె!

పూల తావులతోని పులకించె వనమంత!
ప్రకృతి మాతయు బాడె పల్లవిని గొంతెత్తి!
చిన్ని కృష్ణా! రమ్ము! జేరి మన మాడుదమ్ము!
రాస కేళీ వాటి రమణీయ జంటగా!

నీ మురళి పాటతో నిర్మింపు స్వర్గమును
నీ పాటతో నేను నర్తింతు గోపికగ!
అవని యంబరమంత మానందములు జెంద
చైతన్య దీపికలు జాగృతులు బొందగా!

చిగురాకులను మేసి చిన్నారి కోకిలా!
పాట బాడినదోయి! పరవశము జెందా!



శ్రీ మురళి

# నా మనసు వరియించె !

నా మనసు వరియించె నాట్య గీతాలతో!
మురళి నూదేవాని మురిపాలు జిందా!

విప్పి జెప్పదు దనదు వేదనను రవ్వంత
కుములుచుండును దాను గూర్మి కోరిక దలచి!

నా మనసు వరియించె నాట్యగీతాలతో!
మురళి నూదే వాని మురిపాలు జిందా!

మదిలోన మదిలోన మాధవుని దలచుచును
పొగ మంచుగా మారు బోగిలి విరహ జ్వాల!
చల్లనీ గాలులకు ఝల్లుమని దపియించి!
చందమామను జూడ సఖియ భయపడుచుండు!

తనలోన తనలోన తాను క్లేశపడుచునుండు!
మధురగీతిక లెపుడు మమత పొంగారగా!
పవలు రాత్రులు దాను బరితాపమును జెందు
కలలందు మాధవుని గలవరించుచు నుండు!

ఎంత జెప్పిన గూడ! నేమి సేయుదు చెలియా!
నా మాట వినదుగా! నా మాట జెవినిడదు!
ఎదురు జూచుచునుండు జెదిరినా మనసుతో
తపసి వలె ధ్యానించు తరుణ గోపాలుతో!

నా మనసు వరియించి నందగోపాలునీ!
మురళి నూదేవాని మురిపాలు జిందా!

శ్రీ మురళి

## చిగురాకు వంటి !

చిగురాకు వంటి నా చిన్నారి మనసులో
వేణు గానముతోని విహరింపరాదా!
గోప బాలురతోని గోపికలతో కలిసి
మధుర నాట్యములాడి మన్నింపరాదా!
చిగురాకు వంటి నా చిన్నారి మనసులో
మధుర నాట్యములాడి మన్నింపరాదా!

మబ్బులోపల మెరుపు మాధుర్యమును జింది
తళుకు మన్నటుల నాతనువులోపల మెఱిసి!
చీకటుల తెరలలో జిందించి కాంతులను
అందాల దీపకముగ యలరింపరాదా!

పూవుగా నాలోన పుష్పించి వికసించి
మధుర తావులతోని మన్నింపరాదా!
మధుర మురళిని బాడి మాధుర్య నరసను
బృందావనముగ మది స్పందింపరాదా!

పసుపు కుంకుమలతో బంగారు సంధ్యలను
నా మనసు నింపుమా! నవకాంతి రేఖలను!
ఆడుకో! పాడుకో! అందాల మనసులో
కలిసి నా మనసుతో కల్యాణ మొనరింపు!

చిగురాకువంటి నా చిన్నారి మనసులో
వేణుగానముతోని విహరింపరాదా!

శ్రీ మురళి

# నింగి నీలమునందు

నింగి నీలమునందు నిలిచినా మేఘమా!
నాథునకు నందింపు నాలేఖ వేగా!

దూరభారమటంచు దురపిల్ల బోకుమా!
కరుణగలవారలకు గష్టమేమియులేదు!

నింగినీలమునందు నిలిచినా మేఘమా
నాలేఖ నందింపు నాథునకు వేగా!

ఎదురుజూచుచు విభుని యెండ్లుబూండ్లును గడిచె
కన్నీరు వరదలయి కాల్వలే కట్టినవి!
మఱచిపోయెను నన్ను మాధవుడు గరుణింప
నావిన్నపము లన్ని నాథునకు వినిపింపు!

కంట తడి యారదను! కలగుండు నోకదను!
చంద్రలేఖకు మల్లె చెలి రూపు మారెనను!
మనసులో నీబొమ్మ మాయదని దెలుపుమా!
చేటి కిన్నర నెపుడు చెలి వదలదని దెలుపు!

అందింపు మీా లేఖ యలరి నా నాథునకు
కరుణతో వినిపింపు కలత నలతల నన్ని!
మురళిలో శేరుటయె ముదితకోరకయంచు
మధురాక్షర ధ్వనుల మమతతో బలుకుమా!
నింగినీలమునందు నిలిచినా మేఘమా!
నా లేఖ నందింపు నాథునకు వేగా!

# ఆకాశ వీధిలో

ఆకాశవీధిలో నతివేగమున బోవు
అందుకో నాలేఖ! అందాల చిలుకా!

నావిభున కందించి నయముగా నామాట
అల్లారుముద్దుగా నలరి వినిపింపుమా!

ఆకాశవీధిలో నతి వేగమున బోవు
అందుకో నా లేఖ! అందాల చిలుకా!

తీయనీ పలుకులను దేవ లాలికించుచును
ముత్యాల సరములను ముద్దులొలికింపుమా!
కవితలో వినిపింపు కరుణారస భరితముగ
లలితగీతమువోలె లాలిత్య మొలుకగా!

ఆషాఢమాసాన యలరి మెఱుపును జూచు
వనమయూరమువోలె వన్నెలను జిలుకుచును!
నీ దర్శనముగోరి నిలిచి యుండెనా దనుము!
నీలాంబరమునందు నిలిచి తన నేత్రముల!

చంద్రబింబము జూడ సఖియు! కలువవోలె!
బాలభానుని జూడ పద్మినీ సతిలాగు!
నినుగాంచ నాస కి నిలిచియున్న దటంచు
చిలుక! నీబాసతో చిత్రముగ తెలుపుమా!

ఆకాశవీధిలో నతివేగమున బోవు
అందుకో నాలేఖ! అందాల చిలుకా!

# వేణుగాన లోలు డెపుడు

వేణుగాన లోలుడెపుడు
విడువక నా వెంటనుండు!
నను మురిపించుచు నాతో
నాట్యమాడు నెల్లపుడును! ... వేణుగాన॥

మరువను నే నతని నెపుడు!
అతడు మరువడెపుడు నన్ను!
వెంట వెంట పయనింతుము!
జంట విడువ మెపుడు మేము!... వేణుగాన॥

మురళి మధుర స్వనములతో
మోదముతో మ్రోయుచుండు!
మాధవుతో స్వరము గలిపి
మధురగీతి పాడుచుండు!... వేణుగాన॥

కొంగుకొంగు ముడివేసితి!
కోరిక దెల్పితి స్వామిది!
మురళిగలియ గోరితి నా
మోహమంత అతనిపైని!... వేణుగాన॥

గోపిక వలె నుండుట నే
గోపాలుని కోరికయట!
సన్నగ నెపుడును తనతో!
సరసగీతి పాడాలట!... వేణుగాన॥

## ప్రేమగీతము

ప్రేమగీతము నెటుల ప్రీతితో బాడుదును!
వాసంత మది గడిచె వయ్యారములునూ!

శిశిరమది యేతెంచి చిత్రమగు అందాలు
మాధవా! మాసినవి! మదినెటుల బులకింతు?

ప్రేమగీతము నెటుల ప్రీతితో బాడుదును?
వాసంతమది గడిచె వయ్యారములునూ!

పచ్చనీ చివురులును బలుదావులను జిందు
రంగు రంగుల పూల రమణీయతలు దొలగె!
ఆకురాలేటి యీ యవసాన దశయందు
మధురగీతం బెటుల మనసులో వికసించు!

తొంగి చూచుట లేదు దోరముగ కోకిలలు!
మాటమాత్రములేదు మరియాద చిలుకలకు!
పికిలిపిట్టలుగూడ ప్రీతి జావుటలేదు!
కష్టకాలమునందు గరుణ జూపరు గదా!

నల్లనీ ముసువులో నాథ! నే నుంటినీ!
కంటి నీ రొలుకుచును గాపాడు మని యనుచు!
మన్నింతువో! లేదో! మనసులో! నా వినతి!
చెల్లింతువో! లేదో! చెలగి నా కోరికను!

ప్రేమగీతము నెటుల ప్రీతితో బాడుదును!
వాసంతమది గడిచె వయ్యారములునూ!

## నీలి గగనమునందు !

నీలిగగనమునందు నిలిచినా మేఘమా!
తీయని నా మాట దీరుగా వినుమా!

కరుణతో నా మాట కాంతునకు వినిపించి
పున్నెమును గట్టుకొను బురుషార్థములు గలుగ!
నీలిగగనమునందు నిలిచినా మేఘమా!
తీయనీ నా మాట దీరుగా వినుమా!

పతి విరహ వేదనను బడలిపోయినదాన!
కనుల ముత్యాలనూ కడలి గలిపిన దాన!
కొండలో కోనలో కోకిలకు వలె బాధ
అలసి పోయినదాన! యానాటి గోపికను!

మురళీ నాదేవాని మోదమున మోహించి
మనసు నిచ్చితినమ్మ మదియందు నిలుపుకొని
జతజేయుమా నన్ను జాలిగా దయజూచి
అందింపు మాతనికి యలరి నా వలపులను!

వెదకి యెట నున్నాడో! వేదనను వినిపించి
అందింపుమా లేఖ! యాగోప బాలునికి!
రమ్యాక్షరములలో రచియించితిని సఖి!
తీయనీ మాటలను దేట గీతికలలో!

నీలిగగనమునందు నిలిచినా మేఘమా!
తీయనీ నా మాట దీరుగా వినుమా!

## ఉఱుము మెఱుపులతోని !

ఉరుము మెరుపులత్తోని ఒయ్యార మొలుకుతూ
వర్షిల్లు మేఘమా! వర్ష ధారలతో!
నా చిన్ని కోరికను నా నాథునకు దెలిపి
కొమరొప్ప గైకొనుము కోటి పుణ్యాలనూ!

ఉరుము మెరుపులత్తోని ఒయ్యార మొలుకుతూ
వర్షిల్లు మేఘమా! వర్ష ధారలతో!

పచ్చనీ చివురాకు! పసిడి రంగుల పూలు!
గుప్పలుగ బోసెదవు కుదురుగా భూమంత!
పచ్చనీ చీరత్తో నచ్చముగ లక్ష్మిలా!
ముత్తయిదువుకు వోలె మురిపాలు జిందెదవు!

నీ సుధాధారలను నీ చల్లగాలులను
నా విరహమును బెంచె! నను వేదనల ముంచె!
అగ్గిలో నున్నటుల బుగ్గి నే నయినటుల
వేయి కత్తులవాన వెస పయిని గురిసినటు!

అందింపు నా వార్త యీా మురళిలోలునకు
చిందింపు నా వలపు జేరవచ్చేటట్లు!
మురళిలో జేరుదును మురిపాలు జిందగా!
రమ్య నర్తనలత్తో రమణీయ గీతిత్తో!
ఉఱుము మెఱుపులలోని ఒయ్యార మొలుకుతూ
వర్షిల్లు మేఘమా! వర్ష ధారలత్తో

## ఆషాఢ మేఘాలు !

ఆషాఢ మేఘాల యందాలు గొనిదేవె!
చివురు రెమ్మలలోని చిత్రాలు దేవే!

అలక లలరించుకొని యందాలు జిందెదను
విభుడొచ్చునట! చెలీ! వేదనలు దీర్పగా!

ఆషాఢ మేఘాల యందాలు గొనిదేవె!
చిగురు రెమ్మలలోని చిత్రాలు దేవే!

సంజ కెంపులలోని సరసతల వికసించు
కుంకుమల గొనితెమ్ము కూర్మి నుదుటను దాల్తు!
పసిడి నిగ్గులు జిందు బాలభానుని దీపి
అంగాంగములయందు సలరింపవే చెలీ!

పండినా చేలపై పసుపు రంగులు దెమ్ము!
పారాణి నిడుమమ్ము బంగారు చిత్రముల!
కడలిలో ముత్యాలు కమనీయ హారముగ
కంఠమున వేయవే! కలికి! యందము జింద!

వనవీధి పూలన్ని వయ్యారముగ గ్రుచ్చి
తనువంత నింపవే! తన్మయము నొందగా!
నా విభుడు నాతోని నాట్యమాడే రీతి
అందాల బొమ్మగా నలరింపవే చెలీ!

ఆషాఢ మేఘాల యందాలు గొనిదేవె!
చివురు రెమ్మలలోని చిత్రాలు దేవే!

## మల్లె మాలతులార !

మల్లె మాలతులారా! మాధవీ లతలారా!
నా విభుని జూడుడో! నవమోహనాంగూ!

చిత్రమును లిఖియించి జేర వచ్చితినమ్మ!
కనులార గాంచుడీ! కాంతలారా! విభుని!

మల్లె మాలతులార! మాధవీ లతలార!
నా విభుని జూడుడో! నవమోహనాంగూ!

మురళి నూదుచునుండు మురిపాల రాగాల
నాట్యమాడుచు నుండు నవనాట్య భంగిమల!
ఆలమందను మేపు అందాల బాలుడై
చద్ది యన్నము మూట చంకలో వ్రేలాడు!

అతని వెదుకుచునుంటి అందాల బాలునీ
కిన్నెరను జేబట్టి కీర్తనల బాడుచును!
వాడ వాడల వెదకి వరుసగా వీధులను
వెదకి వచ్చితి నిటుల వేసారి వనవీధి!

ఏ పొదల చాటునను ఏ పూల తీవెలను
దాగియున్నాడేమొ తగ దెలుపు డమ్మలూ!
అతని విరహముజేత నటమటించు చునుంటి
అతని చిత్రముదాల్చి యందఱికి జూపుచూ!

మల్లెమాలతులార! మాధవీలతలార!
నా విభుని జూడుడో! నవమోహనాంగూ!

# కిన్నెరను నే గాను !

కిన్నెరను నే గాను! కీర్తనలు పాడగా!
అలరి నాట్యము సేయ నచ్చరను గానూ!
గోపకాంతను సుమా గోవింద! సుకుమార
లలిత గీతముతోని లావణ్య మొలికింతు!

కిన్నెరను నే గాను! కీర్తనలు పాడగా
అలరి నాట్యముసేయ నచ్చరను గానూ!

నీవు నేర్పిన పాట! నీవు నేర్పిన యాట
కుదురుగా నేర్చితిని కుందనపు బొమ్మగా!
మఱల పాడుచు నుంటి మాధవా! యీనాడు!
చెట్టుపుట్టల నడుమ జేరి వనవీధినీ!

మనసునకు గనిపించి మాయమై పోయెదవు!
మురళినూది చెవుల మోహమున ముంచెదవు!
కనిపింప వెందుకో కనులార నిను గాంచ
చెలి! యనుచు ప్రియమార జేర రా వెందుకో!

దూరాన నుంచి నను దురపిల్ల జేయకుము!
మనసులో ప్రేమలను మఱి నలిపి వేయకుము!
పల్లియ సొగసులను మల్లియల వలెగాంచి
కలువుకొను వేణువుల కమనీయ స్వనములను!

కిన్నెరను నే గాను కీర్తనలు పాడగా!
అలరి నాట్యముసేయ నచ్చరను గానూ!

## నీలి మబ్బుల బోలు !

నీలి మబ్బులబోలు నిగనిగల శ్రీకృష్ణ!
నా మనసులో గోర్కె నాథ! వే దీర్పా!

ఆ కోర్కె తెలియదా? అందాల గోపాల!
చిఱుగాలులకు దెలియు! చివురు పూవులకునూ!

నీలి మబ్బులబోల! నిగనిగల శ్రీకృష్ణ!
నా మనసులో కోర్కె నాథ! వే దీర్పా!

దూరాన కోకిలల తోరంపు పాటలో
నా మనసులో కోర్కె నాథ! ధ్వనియించేది!
వెన్నెలా సొగసులో నేటి గలగలలోని!
తీయగా నాకోర్కె దీరుగా వినిపించు!

భూమి యాకాశాలు బోలుపొందు ప్రకృతిని
అణువణువు నందునా యలరేని నా కోర్కె!
చిరుగాలి తెరలలో జిందేటి సవ్వడుల
మనసు కోర్కె గదా! మధురముగ వినిపించు!

కలిసిపోవాలనీ! కఱిగి పోవాలనీ!
జ్యోతిలో జ్యోతిగా ప్రీతినిలవాలనీ!
మసిబొగ్గు తనమంత మాసిపోవాలనీ!
మాణిక్యమై నీదు మదిని మెఱయాలనీ!

నీలమబ్బుల బోలు నిగనిగల శ్రీ కృష్ణ!
నా మనసులో గోర్కె నాథ! వే దీర్పా!

# కంటినీరు

కంటినీరు దుడుతు వేల?
కనికరమది యేల కృష్ణ!
తీయని నీ యెదను జేర్చి
తేనెలొలుక లేవా ప్రభు? ...॥కంటినీరు॥

దూరభార యాత్రజేసి
తుదకెటులో నిను జేరితి!
ఆశదీర్చి మది లోపలి
యాశల కరుణింపరాద! ...॥కంటినీరు॥

అలల తెరల దాటుకొనుచు
అంధకారములను దాటి!
నీ వెలుగుల కాంతులలో
నీరజాక్ష! జేరుచుంటి!...॥కంటినీరు॥

కలకాలపు నెడబాటును
కడకు ద్రోసి కరుణింపుము!
బహుజన్మల దాసి నేను!
బాంధవుడవు! అల్ల నాటి! ...॥కంటినీరు॥

కాంతిరేఖ జేర్చుకొని
శాంతిగూర్చు గోపాలా!
భవబంధము లన్ని దొలగ
భరియింపుము నీ జ్యోతిని! ...॥కంటినీరు॥

# కొండమలుపున గూసె

కొండ మలుపున గూసె! 'కూ'యంటు కోకిలా!
గువ్వజత గూటిలో కువకువలు జేసే!
వర మేఘముగాంచి వనమయూరము గూడ
నర్తనలు గావించె! రాజనర్తకి వోలె!
కొండమలుపున గూసె! 'కూ' యంటు కోకిలా!
గువ్వజత గూటిలో కువకువలు జేసే!

చెఱువు గట్టున బూసె జెదురుగా దంగెడులు!
మొగిలిపువ్వులు గూడ మోదమున వికసించె!
అందాల చేమంతి యరవిరిసి మోదమున
సింగార మొలికించె సిగ్గు దొంతరులుగా!

నల్లనీ మేఘాల నాదాలు వినిపించె!
మెఱుపు సొగసులలోని మిలమిలలు గనిపించె!
మబ్బునీడలలోన మసక మసకగ యున్న
దూరాన వనరేఖ తోరణము వలెనుండె!

ఈ ఋతువు నందయిన వికసించునా విభుని
మనసు తామరయందు మమత నాపై నింత!
కన్నార గాంతునా! కలతవిడ కృష్ణునీ!
చెవులార విందునా? జెలగి పిల్లనగ్రోవి!
కొండమలుపున గూసె 'కూ'యంటు కోకిలా
గువ్వజత గూటిలో కువకువలు జేసే!

# నీ మురళి గానమును !

నీ మురళి గానమును నీ సృజన మంతయును
నిజమైన ప్రకృతివి నీవెగద కృష్ణా!
నా దంత వికృతియె! నా గాన కవితలూ!
నా శిల్ప నాట్యములు! నయముగా నసకరణ!
నీ మురళి గానమును నీ సృజన మంతయును
నిజమైన ప్రకృతివి నీవెగద కృష్ణా!

ఉరుములను మెరుపులను ఉన్నతంబయిన యీ
మంచుకొండల నెటుల మలుచుదును ప్రకృతిని!
నీలిగగనము నెటుల నిర్మింతు తారలను!
తొలిసంజ కుంకుమల తోరముగ నిర్మింతు!

వాసంత ఋతువులో వన్నెలను నెటుదెత్తు?
వర్ష రుతువున గలుగు హర్షముల నెటు గూర్తు?
తల్లి పిల్లల ప్రేమ దగ నెటుల జూపింతు!
విశ్వగానములోని విమలత్వ మెటు దెత్తు!

చిత్ర లేఖనములూ, శిల్పములు, కవితలూ
అనుసరించినవి నిను నందగా నైకొనుచు!
నా వికృతిని మాపి నయముగా నీ యందు
కలిపికొను గోపాల! కల్యాణమును గూర్చి!

నీ మురళి గానమును నీ సృజనమంతయును
నిజమైన ప్రకృతివి నీవెగద కృష్ణా!

# ఎందుకే కోకిలా !

ఎందుకే కోకిలా? వేయిగొంతుకలతో
పాడుచుంటివి నేడు ప్రణయగీతమునూ!
వాసంత రుతువులో వన్నె లే రాలేదు!
చివురు పూవులు పూచి చిత్రములు కాలేదు
ఎందుకే కోకిలా! వేయిగొంతుకలతో
పాడుచుంటివి నేడు ప్రణయ గీతమునూ!

చివురింప లేదుగా చిన్నారి పూ లతలు
మల్లెమాలతు లింక మధురిమలు విరియలే
దెందుకే కోకిలా! అందాల కోనలో
పాటపాడేవు నే పరవశము చెందగా!

పుష్పాదులు వనవీథి పుడమి నిండగలేదు!
మకరందములు జాఱి మరి కాల్వలవలేదు!
తుమ్మెదలు జుమ్మనుచు దూలి పాడగలేదు
మలయమారుత మింక మది పొంగ రాలేదు!

పతికి దూరమునుండి పలవరించేటి నను!
విరహాగ్ని బడద్రోసి వెత గూర్చుటకు గదా!
పాడుచుంటివి కోకి! ప్రణయగీతము నేడు
సెలయేటి జాలులో శిలపైని కూర్చుండి!
ఎందుకే కోకిలా! వేయిగొంతుకలతో.
పాడుచుంటివి నేడు ప్రణయగీతమునూ!

# నీ పాటతో కలిపి !

నీ పాటతో కలిపి నా పాట పాడనీ!
సుందరోజ్జ్వలముగా శ్రుతిలయలు గలియా!
ప్రకృతి సుందరి కూడ పరవశము నందగా
వెన్నెలలు వికసించి వేడుకను వర్తింప!
నీ పాటతో కలిపి నా పాట పాడనీ!
సుందరోజ్జ్వలముగా శ్రుతిలయలు గలియా!

కొమ్మపై కోకిలలు కుహూ కుహూ రాగాల!
కొండ కోనలన్ని కూరిమిని ధ్వనియింప!
చిలుక గోరింకలలి కూరిమిని జతజేరి
ఆశు కవితలు పలికి యలరింప వనమంత!

నీలిమాకాశాల నిండగా ప్రతి ధ్వనులు
వీణమీటిన యటుల వినిపింప రాగాలు!
తొలిసంజ మొడిలోన దోరంపు పసిపాప
పలికినటు కులికినటు బంగారు కాంతులను!

వెన్నెలల కాలమిది వేడుకను వినిపింతు
మనసులోనీ పాట మర్మముగ శ్రుతి లయల!
అధరమున జేర్చి నీ యందాల శ్రీమురళి
నన్నగా పాడుమా క్రొన్నెలా కాంతిలా!
నీ పాటతో కలిసి నే పాట పాడనీ!
సుందరోజ్జ్వలముగా శ్రుతిలయలు గలియా!

## అడుగడుగునా !

అడుగడుగునా నిన్ను వలచి బిలుచుచుంటి
విసుగుబడ బోకుమా! వేణు గోపాలా!

కన్నీటి ధారలను కమనీయ పదములను
గడుగుచున్నాననుచు గసురుకోనబోకుమా!

అడుగడుగునా నిన్ను వలచి బిలుచుచు నుంటి
విసుగుబడ బోకుమా! వేణుగోపాలా!

నీ వేణునాదమే నీ మురళి స్వనములే
వన్నెటుల జేసినవి నవమోహనాంగా!
నీ దివ్యరూపమే దిశలన్ని కనిపించు!
నీ దీపకళికయే నిండు నా కన్నులను!

నిను విడిచి ఒక క్షణము నిలువజాలను భువిని
నీ దివ్య రూపమును నీ మధుర స్వనములను!
వినిపించు టెందుకో! విలపింప జేసి యిటు
విరహాగ్ని వెన్నెలల గరిగించు టెందుకో!

విడిపోని బంధమిది! విడరాని స్నేహమిది!
జన్మ జన్మల నుండి జరిగేటి గాధ యిది!
పిలుచుచుందును నిటుల వేల యుగములదాక
కరుణించినను దయను గరుణింపకున్ననూ!

అడుగడుగునా నిన్ను వలచి బిలుచుచుచుంటి
విసుగుబడబోకుమా! వేణుగోపాలా!

స మా ప్తం

# ఇతర గ్రంథములు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థ వారి

అనుమతి పొందబడినవి.

2268/తె 800/1484
1. నాలో వెలిగే దీపాలు (బాలసాహిత్యం) 0-50

2269/తె 800/1485
2. విజయ మంగళం (గీతములు) 4-00

2270/తె 800/1486
3. అందరికీ నచ్చిన కోడలు (నాటిక) 2-00

2909/తె 800/1892
4. ఉత్తర గోగ్రహణము (నాటిక) 2-00

3649/తె 700/35
5. శ్రీ కందుకూరి, శ్రీ సరోజినీదేవి (బుర్రకథలు) 2-00

3756/తె 800/2444
6. ఆనంద మంగళం (లలిత గీతాలు) 4-00

3757/తె 800/2445
7. నాట్యశాల (నాటిక) 4-00

4560/800/3026
8. గోపబాలక శతకము (పద్యములు) 1-50

4561/800/3027

9. భూమితల్లి బిడ్డలు (నాటిక) 2-50

6622/తె 800/4551

10. పాలేటి తరగల్లో మల్లి (పాటలు) 5-00

6623/తె 800/4552

11. వీధి దీపం (కవితలు) 4-00

6624/తె 800/4553

12. వినయాంజలి (భక్తి వచనములు) 4-00

6936/తె 200/680

13. శ్రీరామచంద్ర సుధ (పాటలు) 4-00

7037/తె 800/4834

14. ఝాన్సీరాణి (బుర్రకథ) 2-50

7462/తె 800/5129

15. కృష్ణదాసి (లలిత గీతాలు) 4-00

8964/తె 800/5933

16. చిగురులు-పువ్వులు (లలిత గీతాలు) 4-00

8965/తె 800/5934

17. పాలేటి తరగల్లో మల్లి (పాటలు) 5-00

8966/తె 800/5935

18. శోణ పద్మం (నాటిక) 3-00

8967/తె 800/5936

19\. హరిదాసు (పాటలు) 2-00

8991/తె 800/5514

20\. పూలరథం (గేయములు) 4-00

9698/తె 900/572

21\. శ్రీ అల్లూరి (బుర్రకథ) 3-00

10035/తె 800/6768

22\. ప్రతిధ్వనులు (వచన కవితలు) 4-00

11028/తె 800/7349

23\. గోదాదేవి పాటలు (లలిత గీతాలు) 2-00

11679/తె 800/7794

24\. గిరిజా కల్యాణము (ద్విపద) 10-00

126 6/తె 800/8429

25\. ఎఱ్ఱన పోతనల కవితామాధుర్యము

(తులనాత్మక పరిశీలన) 10-00

2717/తె 800/425

26\. మౌన గీతాలు (లలిత గీతాలు) 5-00

13660/తె 800/9061

27\. కన్నీటి పువ్వులు (లలిత గీతాలు) 8-00

13661/తె 800/9062

28\. శాంతిగీతం (ముత్యాల సరాలలో) 6-00

## నూతన ప్రచురణలు (1993-94)

| | | | |
|---|---|---|---|
| | 15163/సా. తె 800/10139 | | |
| 29. | మధురగోపిక | (లలిత గీతాలు) | 8-00 |
| | 15164/సా. తె 800/10140 | | |
| 30. | మురళీ స్వనాలు | (లలిత గీతాలు) | 8-00 |
| | 16027/సా. తె 800/10661 | | |
| 31. | పిల్లనగ్రోవి పిలుపులు | (లలిత గీతాలు) | 10-00 |
| | 5431/ని. తె 800/1422 | | |
| 32. | సుందరకాండము | (గీతికలలో) | 15-00 |
| | 5616/ని. తె 800/1490 | | |
| 33. | దీపలేఖ | (నాటిక) | 10-00 |
| 34. | శ్రీ మురళి | (లలిత గీతాలు) | 10-00 |

